గీ. వ్రాలికొలువు మేడప్రోలశోభిల్లుచు, నరదమునికి సూచియతనిఁ జూచి
దివ్యశిల్పియొకడే యితఁడని రాజు, సభయు సంశయించి సంభ్రమింప. 27

వ. అతండు నగుచు నట్ల యగుటంజేసి నిజాకారంబు దాల్చి తనకుం బుడమి రెండుగా వించు ప్రత్యుద్గానాదులు గైకొని యభ్యర్చితుండయ్యె నయ్యిరువురు నర్హాసనంబులనుండి యుండి యొరుల కుశలంబులడిగినంత నజ్జనవిభుండు వినయంబున నయ్యమర ముఖ్యునకుం బ్రాంజలియై. 28

గీ. ఈవు నిలుచుండఁ గూర్చుండి యేను నిన్నె, యొక్క సామాన్యుఁ గాఁ జూడనోడనైతి
ననఘ మాకెల్ల నిక్కువం బావహిల్ల, వైభవముఁ దాఁచి యీలీలవత్తురయ్య. 29

మ. అపరబ్రహ్మవు నీవు నావుడు కృపాలా దేవకార్యార్థినై
యిపుడే వచ్చినవాఁడ నొక్క వినయంబే పాటి నేఁ జేయన
వ్యపదేశంబునఁ గానికూడ దదికాదా యట్టులేరాక నా
కుపచారంబొనరించెదే వినుము దీయోద్దేశ్యముం జెప్పెదన్. 30

క. బలవంతులు దైతేయులుఁ బలఘుస్మరముఖులతోడ బద్ధద్వేషుల్
కలహములు కాక మానవు, కలవాఁడవు నీవు విబుధకార్యంబునకున్. 31

సీ. నేమివినిర్భిన్న నిమ్నోన్నతంబుగా నవనీభాగమున బిట్టుఱుకఁ జాలు
చువ్వన నెగసి విష్ణుపదాంతరమున రెక్కలువచ్చెనో యనఁ గదలఁ జాలు
త్రోవనిన్నడుగక దుర్వారగమనమై దండశూకజగంబు దరియఁ జాలు
రవిరశ్మిరహితఘోరప్రదేశంబులు వెలిగించుకొని చొచ్చి వెడలఁ జాలు
పెంచి యొకచోట ననువైన నటించఁ జాలు, మించి యొకచోట విభువైన చరించ జాలు
దివ్య మీతేరు మీకు నతిప్రయత్న, మున నొనర్చితి గైకొమ్ము మనుజనాథ. 32

ఉ. నీవిదియెక్కి పద్మభవ నిర్జరనాథుల చూడ నెప్పుడుం
బోవుము వచ్చుచుండి పనిబుట్టిన వేల్పులపాలఁ గల్గి చే
చేవ యొకింత చూపుమని చెప్పి శిరోహితుఁడయ్యె నయ్యెడన్
దైవతలోకశిల్పి యరదంబటు వెట్టి మహాద్భుతంబుగన్. 33

తరళ—మనుతనూభవుఁడుం బ్రమోదనిమగ్నమానసుఁడై నిజా
సనముఁ డిగ్గి రథంబు చెంతకు సంభ్రమంబున వచ్చి య
\నమొనర్చి ప్రదక్షిణాదులు సల్పి ఖడ్గగదాశరా
సనశరప్రముఖాఖిలాయుధజాలమేర్చి యమర్చనన్. 34

వ. తేరును వీరరసంబు దేర ం బోరుగోరు గవాక్షహాధ్వనుల గర్జిలుచుండెం దద్ది

వ్యరథమాహాత్మ్యంబు చూడందలంచి విభుండు సేవాసమాగతమూర్ధాభిషిక్తులను
మంత్రిపురోహితప్రముఖనిజానురక్తులను నగరివాకిట నిలువంబనిచి నిజప్రథమకుమా
రు సుకుమారు సారథ్యంబునకు నియోగించె. 35

క. అని పలికిన జనమేజయ, జనపాలకుఁ డా ప్రతాపశాలికి నెంద
ర్తనయులొకో యని యడిగిన, విని వైశంపాయనుండు వినుమని పలికెన్. 36

క. నూర్వురు కుమారులతనికి, నిర్విఘ్నకృతప్రతాప నిర్వైరిదిగం
తోర్వీదుర్వహ హథురా, నిర్వ్యాకులుగలరఖర్వ నిర్వేలయశుల్. 37

క. సకల జ్యేష్ఠుండందును, వికుక్షి యిక్ష్వాకుఁగొలువ వెసఁదమ్ములతో
నొకనాఁడు వాఁడు రాఁగా, సుకుమారుండనిరి దేరి చూచి మహర్షుల్. 38

క. ఆబుధవచనములతనికిఁ, బేరయ్యెక్కనాటఁ గోలెఁ బ్రియసుతు నతనిన్
సారథిగాఁ గొని విభుఁడా, తేరెక్కి కదల్పఁబనిచెఁ దిన్నఁగ మింటన్. 39

గీ. అవనినుండి మింటికి రదంబు రాఁగాంచి, నింగిఁ దిరుగు ప్రొద్దు నేలకేల
పోయి రాఁగఁగడఁగెనో యని పైఁజూచి, కాదిదేమియంద్రు ఖచరసతులు. 40

వ. ఇత్తెఱంగున గగనంబునం బోవు సమయంబున. 41

సీ. ఒకవేల్పుతో మాటలకు నిల్వఁబలసినఁ బగ్గముల్ గదియంగఁ బట్టుకొన్నఁ
గెలని వింతలు చూడఁ దలఁపు గల్గినచోట నెప్పుడప్పటివాఁగ ద్రిప్పుకొన్న
ముంచిపోవు విమానములు కూడఁగోరినఁ గేలెత్తి ధే యని తోలుకొన్న
జగదంతరప్రజాసమ్మర్ద పథముల హాధిరా యని వేగమాగుకొన్న
మనలుఁ గేడించుఁ దిరుగు సమ్మతిగ నరుగు, రథికహృదయంబెఱింగి యారాగుఱాలు
మొగల కొక్కింపలంకార మగుట కాక, యేను సారథిననివాని బూననేల. 42

క. అని సుకుమారుఁడు నెమ్మన, మున రథరథ్యముల మెచ్చి పొగడుచు నిచ్చం
జననిచ్చె నడుమ నారద, మునివచ్చెం గ్రొత్త మొలమి మోమున మొలవన్. 43

క. అతనికి జనవిభుఁడు యథో, చితసంభావనలొనర్చి చేతివిపంచీ
లత యందికొని శతాంగ, స్థితునింగావించి పలికెఁ జిత్తంబలరన్. 44

గీ. తివిచిచూడలేదె గవిశన యొన్నండు, నోళవుదమ్ముఁగప్పి యొప్పడాఁగి
తంత్రులాడి విన్నఁదన మొండె నిదియేమి, మహతి యున్నయునికి మానిచంద్ర. 45

క. ననుఁ గరుణాలోకనమునఁ, గనుఁగొనఁగాఁ గలిగె నొకొ వికాసము నేమ్మో
మునకుం గానీ దేవర, కనుఁగవబడలిక లుగన్న క్రైవడి తోచెన్. 46

వ. అనిన విని మునివరుఁడు. 47

ఉ. అమ్మెయిఁ బ్రస్తుతించి నతుఁడై యతఁడయ్యెడఁ జూడఁజూడ బిం
బమ్మున నున్న మాధవుఁడు పార్థివు కంటఁబడం గరంబు చో
ద్యమ్మయి త్రోచె నారద మహాముని పేర్కొని రాజరాజ నీ
యుమ్మడి కీర్తనంబిరవు లోకప్రభుఁడు గానొనరించె గంటివే. 59

వ. ఈయంశుమాలి సాక్షాద్వనమాలియగుట ప్రకటంబయ్యె నని నుతించుసమయంబున.

ఉ. రార కుమార యంచు దినరాజు కవుంగిలి సాచి పిల్వఁగా
దేరికిఁ దేరు దారసిలఁ దెచ్చి కుమారుఁడు దాను వచ్చి యు
ష్ణాంశుధన్యుఁ డంబురుహపాలనపుణ్యఫలంబ యావృశా
కారయుగంబు దాల్చె ననఁ గాఁదగు నంఘ్రులమీఁద వ్రాలినన్. 61

క. కరుణాకరశీతలుఁడై, యురువురనిరుఁగేల గ్రుచ్చి యెత్తి యొనర్చెం,
బరిరంభణ మంభోరుహపరమాప్తుఁడు వారిహృదయపద్మములలరన్. 62

వ. ఇత్తెఱంగున నాలింగనం బొనర్చి దినమణి సుకుమారుం జూచి నుతియుఁ
గలరు గాక మఱిమి యిట్టి భాగవతముద్రానిద్రులు గలరే యని వెండియు 63

చ. ఇతఁడొకకాయ గాఁచి సుతునిల్లనిపించె మునీంద్రవీనిసం,
తతికభివర్ధనం బరయఁ దావకధన్యకటాక్షపాతమే.
వ్రతమని పల్కఁగా ఘనత వర్ధిల వైష్ణవతేజమేఁగి భా
రతసుకుమారగర్భముఁ జొరంబడినం బ్రమదప్రసన్నుఁడై 64

క. ఇనుఁడయ్యంబరికం బెను మునుమున్న మహాద్భుతంబు మున్నిటితెరన్
మునిఁగిన మునిఁగని కంటే, వనమాలికృపావిశేషవైభవమిచటన్. 65

క. వంశపతియై జగత్పతి, యంశంబున వీనికొకరుఁడావిర్భవిలున్
సంశయమేమిటికిఁ బ్రియ; త్రింశత్కోట్యమరభారధురీణతఁ బెరుగున్. 66

కవిరాజవిరాజితము.

అనిచతురాననసూనునకున్ వినయప్రతిపాద్యబహూకృతులున్
మనుమలకుందగు మన్ననలుం దినసాధుఁడొనర్చి జయించి విరిం
చన భజనంబుగ సాఁగిచనుం డని సారథివై పధరంబారయం
గనుఁగొనఁ బశ్చిమఖండంబునపై రొకకంటి రథంబు వెసం బఱచెన్. 67

గీ. ఇత్తెఱంగునఁ జంగున నినుని తేరు, పడమటికిఁ దాటఁ గాంచి యూరొడయొకింత
నిలచి తడసిన వెనువెంట నిబ్బరముగ, వచ్చెఁ బొమ్మని నారదుండిచ్చమెచ్చి. 68

క. కమలభవభువనయాత్రకుఁ, దమయరదముఁ బఱపుఁ బనిచి తండ్రికొడుకులన్

ప్రమదవికచాంతరంగుల, సముయోచిత వల్లకీరసంబునఁ దనుపన్. 69

వ. తలంచి. 70

ఉత్సాహ—లోకబంధుసత్కృపావలోక కల్పవల్లికల్
నీవు నీకుమారునకు ఫలించె దోడుతోడ నిం
కేకొలంది శోభనంబు కుదురుకొను నె యంచు ని
క్ష్వాకు నృపతికింబ్రసంగవశవచఃప్రపత్తులన్. 71.

క. మనమలరించుచు నెమ్మెయిఁ, జనువాడావలనునూపె జనవరనాకం
బునకిది సొరదల యేజగ, మున వాడును మెుగముఁబ్రవాల్చెంబోయిందుండన్. 72

సీ. ఊర్వశిరంభ తిలోత్తమ శశిరేఖ హారిణిచంద్రకళయనంగలతిక
మదనమోహిని వపుష్మతికాంతిమతి శుభానకళానిధి వరూథుని ఘృతాచి
మేనక పంచాశ్వమేధిని రాజనూయార్థిని క్రతుశుల్క తీర్థశుల్క
జలపద కర్పూరతిలక లీలావతి దారుసంజీవని దానశుల్క
మునిమనోహర ధాన్యమాలినిసమీచి, భుంజికస్థలప్రమ్లోచ మంజుఘోష
చారునామచకోరాక్షి సౌరభేయి, హేమమొదలైన యచ్చరతేమలధిప. 73

గీ. [illegible]రె ఖచరాదిధైర్యముల్ వీటిబోవ, జనుచునస్నాన వమచినూదమనిసభకు
నప్పుడు [illegible] [illegible]ందు సేఁగుదేరఁ, బొ[illegible]గన [illegible] [illegible]క [illegible]చెఁ గర్పూరతిలక. 74

శా. [illegible] పర్యురణ దీక్షాపాటవం బొక్క పూ
వింటంబోదని [illegible]మవచ్చి దగభ్రూవిక్షేపముల్ చూపినన్
గెంటింపంగ వసంబుగాక కడకుంగేడించెనో లేదొ క్రీ
గం[illegible] దూరుచుఁ దానసిగ్గు గడిరెం గాబోలు నచ్చెల్వకున్.

పూర్వాశాక్రమమున. మానివనమనమునకు వెలుఁగు మొలపింపఁగ మ
న్నన [illegible]యధిపుడచ్చ[illegible] ననిచెం బద మేష్ట్రిలోయాత్రావాంఛన్, 76

క. అత్తెఱఁగున నయ్యచ్చర మొత్తము పొడగాంచిపోవమునితో రాజున్
గత్తనయుఁడు దివ్యరథో [illegible]త్తగతుల్ వొగడికొనుచుఁ దగుగతిఁజనఁగన్ 77

[illegible]మలనదుపులా! యామందయానంబు లటఁ జేరిగాకనిహంచిందు
[illegible]ల గుబ్బలా! కొలముసామువు వీడుకొనిరంటగాక నిశోకకులము
[illegible] చహపులా [illegible]లిగిన మీలెల్ల బయలెక్కెఁగాకని బకకులంబు
[illegible] [illegible]గములా [illegible] నారవిందంబు లొదవెఁగాకని తెఁటి కొదమసంత్తు
వచ్చినో [illegible] వచ్చిపోవ, ననఁగ మానసమునునుండి హంపినుండి

సామిదోననుండి చంద్రపుష్కరిణినుండి, వింటఁబడి వచ్చెఁ గాసారవిహగతతులు

మత్తకోకిల— వచ్చినంగని మానసాదినివాసవాసనివాసెసా
విచ్చిరాఁ బన్నియేమి యేమని విన్నవోకసులాకరం
బిచ్చె మానిసిమాట నేరుపు లింక పీనికభీష్టమిం
కెచ్చటో యనివారలారయ నిచ్చగింపఁగనచ్చటన్. 79

సీ. మొకరిదేఁటులు తీరవికచకేసరములు చేముంచియక్కులఁ జేర్చికొనఁగ
తవరకొక్కెరలు బేషసమీలఁదరఁగలు తెగఁదాటి నడిమికేఁ దెచ్చుకొనఁగ
కవజక్కవలు పళత్కమల కోమలదళావళులు బంత్తులుసాగ బిలచికొనఁగ
రాఁగరాయంచలు నూఁగారఁ బెటిఁగిన బిసములు దమపాలఁ బెట్టికొనఁగ
పరపుశతయోజనంబుల పాటినూప, బొడవుమతినూరుయోజనంబులుపొసంగ
గగనమిరవైన నిడుసాగగడ్డతోడ, గట్టెదుటఁ దోచెనపుడొక్క కమ్మకొలను. 80

వ. అయ్యవసరంబున నమ్ముగురుం దమలోక. 81

చ. వికచసరోవరంబు పసివేరునలంగకయుండ గెడ్డలోఁ
బెకలిచి తెచ్చిమింట మొలపించినవారిపు డెవ్వరో వివా
దకధకుఁ జోటుసూపని పితామహసర్గనిసర్గవైభవం
బొకయిదె మేలు రథ్యముల కూరటగాఁ బదమూఁదఁ గల్గెఁగా. 82

క. ఈవేళ కిచటకొకకొల, నావిర్భావంబునందు నదికానున్నె
తావిన్న వినికి యవ్వివా, గావళికాదనినవచ్చు నామచ్చటతోన్. 83

వ. అని తలపోతలకంజొచ్చిరందు మనునందనుండు వెండియు. 84

సీ. తివుట పుట్టింపవే పవనపాకంబు లీపాలపంబు దప్పులపొలము గాక
కలుగదే కమలసౌగంధికాదికము లీవలపనాఘ్రాతపూర్వంబు గాక
యొప్పనుప్పొంగవే యూర్మిశీకరములీచలువవేఁటక వింతకొలము గాక
పొసఁగవే క్రౌంచసారసమిధునంబు లీసంసారమన్యాదృశంబు గాక
ఇట్టి కొలనెట్టు సేసె శేషకేశుఁడనఁగ, నందుగంధర్వ విద్యాధరాదులపుడు
వల్లభులుదారు జలకేళి వలలఁబడిరి, సమధికవిమానములనుండి దుమికిదుమికి. 85

క. మగపిండు మగువపిండుం, దెగలేర్పడి చల్లులాడ దివికుప్పరముల్
నెగసిపడు వారిధారల, నగుదెంచె నమేఘవృష్టియంచలు సెదరన్. 86

వ. అంత. 87

సీ. ఓకరభాగంబు కొంచకచంచుపుటి నుక్కపూబోఁడి వలిగుబ్బపాడిచిపోయె

నొక చేఁదస వికస్వరోల్లాసగతి నొక్క కలికికన్నులవెంట బెళకుచున్నదియె
నొకకచ్ఛప కిశోరమొరసి పెక్కులనొక్క తొయ్యలి మీఁగాలఁ ద్రొక్కిపోయె
నొకమిండతుమ్మెద యురికి యుక్కున నొక్క తరుణి ధమ్మిల్లపుఁ బూతన్నిపోయె
పోవుగాకేమి యీసులపొంకెఁ బోక యొఱలు మే మేమి పుట్టునో మఱియు ననక
విభులుఁ బురికొల్పు సురకాని వెపులనైరి మెలఁతలా రాజ్జలకేళి మీఁది బ్రాళి. 88

క. ఈకరణిజలక్రీడలు మేకొని యొదవారుఁ దటన మేరుచ్ఛాయల్
గైకొని యొడువారున్నై యాకాశచరు లెల్లం గ నక్కొలనమరెన్. 89

ఉ. నారదుఁ డప్పుడొన్నృపతి నల్వ మొగంబున దీని కారణం
బారసి విందమన్న నతఁడానన దేరటువాయఁ దీరమున్,
నీరముఁ జేరియున్న మహనీయుల మ్రింగి సరస్సుదానవా
కారముఁ దాల్చె వృక్ష విహంగంబులు రక్కసులై భజింపఁగన్. 90

ఉ. క్రొవ్వన నార్చి శంఖనఖ కూర్మశిరః పృథురోమ దద్దుర
గ్రీవ శ్రవస్సహస్ర తిమికీకస రోహితమీనపుచ్ఛ రా
జీవ భుజాది రాక్షసులఁ జేవ చలెన్ జలజంతు భూమికల్
భూవర భూనరుండు మునిపుంగవు మోమును విల్లుఁజూడగన్. 91

ఉ. అప్పుడు నారదుండు మనుజాధిప యీజగదద్భుతక్రమం
బిప్పుడు గానవచ్చె నిది యేర్పడనంతయు నే గ్రమంబునం
జెప్పెదఁ గాని తేటవిలు సిద్దము జోడు సిడంబు వీరికిన్
జొప్పడి రాకమున్న తెరఁ జూడుము కొందల మంచు బల్కఁగన్. 92

సీ. అజగవాదులకును బ్రజలైన ధనువులు పొదినాలుకలుగోయు ప్రదరములును
ఒరలు వెల్వడి మంటలు [illegible] యు ఖడ్గంబులుఁ గాలదండ ఖ్యాతిగని వగదలు
దివ్యాస్త్ర మాతుల [illegible] లవి దామరములు జముఁడు మూర్చిల మ్రోగు శంఖములును
నగ్రభమ్ముకం బెనెత్తగు నట్టి పడగలు రవిరథ్యములఁ దట్టఁ దివురుహరులు
గలుగ వరలబరథములాక స్పీమగ నొదవ దనుజులు రథికులై రొక్కలకును
దాన వేతరరహితంబు లొనుగాక గగనకాసార దైత్యులే జగములనగ 93

క, [illegible] వేళ దివిజకాననవ దావాగ్ని నభస్సరోభిధానుండు రక్షో
[illegible] లు డొకని వారథమున, వేవెలుఁగుల వేల్పుకం బె వెలుఁగుచునుండెన్. 94

చ. మనుఁ [illegible] పద్మజకుమారుఁగనుంగొని న [illegible] ట నో
రన వసియింప వచ్చె రథరాజ సమాజము వచ్చుఁగాక మీ

రనుటన్ నిజంబు నయ్యసుర యక్కజుఁడ ప్రభసరస్సమాహ్వయుం
డని యగుఁగాక యంచుఁ ధనువందినఁ జూచి యతెన్ మునీంద్రుఁడున్. 95

క. తడయుకుము నీభుజాబల, మడరింపుము నేను నోపినంతసహాయం
పడుదునని హెచ్చరిక చేఁ, యుఁడుగడఁగెన్ బార్థివుఁడు యుద్ధంబునకున్. 96

వ. అనినవిని యన్వలివృత్తాంతంబు సవిస్తరంబుగాఁ జెప్పుమని యడిగిన యాత్రేయ
కుమారుంజూచి వైశంపాయనుండు. 97

ఉ. వాసవవిద్విషన్మదనివర్తన నర్తనలీలలెమ్మెయిన్
వాసరరాజపౌత్రుఁడును శారిరుహాసనపుత్రుఁడున్ సము
ల్లాసి సమీక కౌశలములం బచరింప నుపక్రమించి ర
య్యాసుర సేనతోడ నవియన్నియుఁ జెప్పెదనీకు నేర్పడన్. 98

మ. హయరాడ్వారణ ఘోషరోష హసనా హుంకారహుంకారముల్
వియదంతః పుటపాటనంబు సలుపన్ విక్రాంతరక్షస్సము
చ్చయ ముచ్చైస్స్మయ భీమమై పయికొనం జండాంశుపౌత్రుండు ద
ద్భయదాకారులఁ జెండెఁ గుండలితకోదండప్రయుక్తాస్త్రుఁడై. 99

చ. జనపతి వేఁడితూఁపుల భుజంబులు వ్రచ్చి యురంబులుచ్చియా
ననములు వాఁడి చాపములు వాఁడిశతాంగములాఁడియుగ్రకే
తనములు నాడినం జరుకుపుట్టి వారలు రేఁగిమూఁగి ర
ద్దనుజపతుల్ మహారథు లుదగ్ర శిలీముఖవృష్టి ముంచుచున్. 100

చ. పసిడి మెఱుంగు వెట్టు పుటపాకవిశేషములోలె విద్విష
ద్విసరశరారనోచ్చలిత విశ్వభయంకర రేణు
... ... రథరాజము తేజము హానబట్టి పెం
పొసగెనకాని చొచ్చియును సుచ్చము సేయఁగఁజాలదేమియున్. 101

క. అంతటఁ బోవక దానవ, సంతానము విలిధవిశిఖ జజ్వాలసము
ద్భ్రాంత జగదంతరంబుగ, సంతమసారి జసుమారు సరికింటెనఁగన్. 192

చ. మిడుగులు మిన్నులై మెరయు మేరువులై పొడకట్టు చుక్కలై
పొడవునఁ బొల్చుదంతులయి పోయివడింబరతెంచు మబ్బులై
పిడుగులు రాల్చు గాడ్పులయి బిస్సున వీఁచు ప్రవాహపఙ్క్తులై
కడలు లలముంచు చునట్లు ఖరగర్వము సూపఁగ దద్ధావళుల్ ... 103

క. ఒకరొకటొక పోటొక, వేటొక యాటొక ముట్టి పాలునొందకతండ

కృకటపుటలు మాన్పనొక్కఁ, డకలుష దివ్యాస్త్రతతులఁ బదియాఱ్లుండెన్. 104

ఉ. ఏమనవచ్చునయ్య మఱి యెక్కిన యవ్విభు తేరుఁ బద్రథ
స్తోమము పించియాటలకుఁ జొచ్చినచందమునందలీలమై
లోమెరపున్ వెలిన్స్వెలుఁగులోకము పిక్కటిలంగ వైభవ
స్థేమము సూఁపుడాఁగు వెపకించుకొనుం బరతత్త్వమోయనన్. 105

ఉ. డాఁగని డీపి తో మెకరుఁ డాగిన డాఁగ నీక నెత్తుటం
దోఁగ కతోఁచుచుం బగరఁ ద్రుంపఁగ జొచ్చె నృపాలు బాణముల్
మ్రాఁగిన మ్రాకలుం బయల మ్రాకలరోయఁగ బిట్టు నేలకున్
వ్రేఁగుగ రాలెఁ దద్వివిధ విస్ఫుట ఘోరశరీరఖండముల్. 106

వ. అప్పుడు. 107

సీ. కరికరస్థూలరక్తనవాంబుధారలు బలసి జోరున జడి పట్టెగుటీయ
తరుణమేదఃఖండశకరకాని క్రాయముల్ బేతాళభక్ష్యంబులై తోరంగ
ముఖహుంకరణశేషముఖరమస్తకములు బిడుగులై పలుగొంట లడరఁ బడఁగ
నలఘుబాహాబాహు జంఘులు వెల్లిపాముల బలగమ్మై పెలుచఁగప్పలుగ రాల
అద్భుతాసహమైన పర్జ్యాగమంబు, భూభువన మెల్ల నెఱిగఁగ బుట్టెనయ్య
నరసుకోరఁగ హితముగా ధరణిభుఁడు, గగనమునఁ జూపు సంగ్రామకౌశలమున.

ఉత్సాహ — అట్టి వేళ విశ్వకర్మ యరుగుదెంచి దీనికిన్
జట్టి పుట్టఁ బాంచజన్యజన్యశంఖమున్
బట్టి గాఁగ నిచ్చియుల్లసత్స్వతుస్సరద్విషున్
జాజ్జ్వల భూపరునకుఁ జూపి యేకతంబు గాన్. 109

క. జలజహితవంశవరునిఁ, బలుతూపుల వీడు రథము పైనెరగ వెసం
దలఁద్రుంచి యుపరదళనము, సలుపుట గర్జమని తెలిపి చనుచున్నంతన్. 110

వ. మధుప్రముఖ బలవదసుర సమరపరంపరాపరిచిత పరమపురుషార్థరస్పందంబైన చిం
దంబు జనకంబంబుగాఁ బుట్టిన గెలుపుముట్టి సేరిన యుత్సాహంబు దేహంబు
పొంగ నుత్తుంగ నిజరథాధ్యక్షంబు దుర్నిరీక్షంబును హృదయానుసారి సర్వపథీన
సచారదక్షంబును సారథిని రక్షకంబునై యుక్కు మీర నోరకుండ నోలయని
పచండ కోదండధరుండై సుకుమారుండు కుమారుండును బోలె విక్రమంబున నుప
క్రమించిన తాండవపాండిత్యంబు కృత్యంబుగాఁ గమలభవాపత్యంబత్యంతనయ
న మధుర సంచార సంభవ ప్రభవంబైన యానందవిభవంబు ప్రకటింప వికటపుట

పతాకుల కెసఁగలుగఁదొలంగి నింగినాంగీరసపురోగములై గములగుచు గీర్వాణులు
చలాచలపాణు లగుచు నిగూఢవచనంబులఁ దనకు మంగళాశాసనంబులు సేయ నా
యత భుజావిజృంభమాణ బాణాసనంబుతోఁ బినాకిపాణియుఁ బోలె నాభీలశరజా
లజ్వాలలం బ్రేలిచి యాడుచుండం గలగుండువడి విడివిడిగాఁ బలల భుగ్బలంబు
ప్రాచికవాచికం బతీచి కుదీచికిం బరవఁ బఱవసంబు గల మగలుకొందఱందఱిం
బేరుపేరం జీరి. 111

గీ. పాఱుఁడొక్కఁడొకఁడుపడుచువాఁడిటవచ్చి, పోయిరొకఁడ చిక్కెఁ బోటుబంటు
కలను వోడువ నుప్పఁ గలుపోలె నిక్కచ్చి, తేరువానికోడువారెమీరు. 112

చ. అనివారిం బురికొల్పఁ గోల్తలకుఁ జేయం గల్గువా రగ్నిలో
చన పాతాళవిభేది మత్స్యమథన స్వర్గాంతకాదుల్ శరా
సనముల్ నింగికి వ్రేశ పట్టుచు భుజాసంరంభ మేపార శం
ఖనినాదక్షుభిత త్రిలోకముగ వీఁకన్ దాకి రొక్కుమ్మడిన్. 113

గీ. వారివెనువెంట శౌర్యధుర్యుఁడగుచు, నపుడు నృపబాణవితతిఁ బ్రత్యస్త్రహతుల
గూల్చి మాడ్చుచు వచ్చెఁబోఁ గూర్మశిరుఁడు, వెలికిలోనికి నెవఁ బాఱు తలయుఁదాను.

చ. మనుజవరుండు కూర్మశిరు మస్తము వెల్వడుపేళ వేఁచి తో
డనఁ బలు తూపుఁ జీలలు మెడం బిగియించి భవన్ముఖంబు నీ
యనుఁగులు వింతవింతపడి యందరుఁ జూతురు గాక లోనికిం
జొనుపకు మన్న నీవు నిఁకఁ జాతువుగా యని యల్గియాతఁడున్. 115

క. ఒకకోల మెత్తివైచిన, సుకుమారుఁడు నడుము నఱుకఁ జూచి విభుండ
వ్వికటశిరుశిరము దమజాలు, తుకతుక నుడుకంగ వాఁడి తూఁపునఁ గూల్చెన్.

గీ. నూఁడుపట్టి పెనగుచో మీనపుచ్ఛుని తోఁకఁ దునుము కొడుకు దుండగమున
కధిపుడల్ల నవ్వియుద్దాయ రక్కసి, బ్రతుకుమాన్పె దివ్యబాణమేసి 117

సీ. జనకుండు దుమికి కద్ధునిఁ గీటడంచినఁ దనయుండు పృథురోము తల యడత్చె
గురుఁడు ఖేకగ్రీవు కుత్తుక దునిమిన సుతుఁడు రోహితుని జీవితముఁ గొనియెఁ
దండ్రియవ్వరవిసూతకు బారిసమరినఁ గొడుకు శంఖనఖాఖ్యుఁ గోలుమసఁగ
నయ్య రాజీవబాహాసురుఁ బొలిఁగొన్న బిడ్డండు కనఖునిఁ బిలుకుమార్చె
దివిజరాజాదిదిక్పాలదేవతాక, విశిఖముల నిట్లు దైతేయ విశసనంబు
సలిపి రత్యుగ్ర సుకుమారు లుభయకేళిమిఁ, గొంతవడిఁ వంతువడి మరుత్కోటి వొ ...

భుజంగప్రయాతము.

గిరిస్కంధుఁడుఁ గ్రాజికేళీధురీణ, త్వరం బార్వతంబైనవాలంబుపింటన్
గదంబల్గిసంధింపఁగాదాని వానిం, ధరాభృద్ధనుర్ముక్త దంభోళితీర్చన్. 119

ఉ. అంతటఁ గేలుమోడ్చి కొడుకయ్యెశుఁ గయ్యము సేయవచ్చునా
కాంతక మర్త్యభేది పలలాశులఁ బేర్కొని చూపి వీరునా
వంతని కొన్న నియ్యకొని వానికి వారికిఁ బోరు వెట్టి వృ
త్తాంతవిశేషమింకఁ గలదాయని రాజు మునీంద్రుఁ జూచినన్. 120

క. తలయూచియతఁడు భళిభళి, కొలువోయిది రణము యిష్టగోష్ఠికథకుం
దలసూపె నిట్టితేజము, కలుగున కద యింతకొడుకుఁ గాంచిననీకున్. 121

సీ. అనిపల్కి చెప్పెద వినుము వేఱొకఁడేల జననాథ గగనకాసారకథయ
యప్పేరువానికి నన్వర్థమని సరస్వతి పల్కె వినువీధి జననవేళ
వాఁడుగ్రతపమును వాతాతపాదులు గ్రోలి వుట్టిననాటఁ గోలెఁ జేసె
దాన లోకములు కొంపలమునఁగా నజుం డడిగిన వర మెల్ల నతనికిచ్చె
నవనియవనిగ నాకసంబాకసముగ, జలము జలముగ గాడ్పుగాడ్పుగను బాంచ
భౌతికాంగంబు సరసియై బయలు ప్రాఁక, రాజిలునతండు తేజంబు తేజముగను. 122

క. కొలననుచు మునులు వేల్పులుఁ, దెలియరు తత్కపటచేష్టఁ దివురుదురాడన్
గలనైన వచ్చుమాయా, బలవద్రథసాధనములు బ్రహ్మవరమునన్. 123

గీ. మఘవ ముఖుల నైన మఱునాఁటి కఱిగించు, కొనునతండు మ్రింగియనుమఁగాదె
దనుజ హానన కుక్షిదళన వేగముఁ గోరె, నువరగతులమనుపఁ ద్రిదశశిల్పి 124

ఉ. ఇట్టివరంబు లబ్జసుర కిచ్చినవాఁడజుఁ డిజ్జగంబు లె
ట్టట్టగునో యట చపుడ యింతటి తేజస్సృజించియిచ్చి మా
పట్టియ నిర్వహించునని పంచెఁ జుమీ సురరాజశిల్పి నీ
చుట్టపు టోడు పాటునకు జోదులరాయ జయించి తిందరక్. 125

పంచచామరము—అలంతులయ్యు కూర్మమస్తకాదులైన జోదుల
బ్బలారి వెన్నుసూపి నారపాచినాఁడ కాని నే
నెలంఘ్యబాహుశక్తిఁ దానవాజిలోననంచుఁబి
చ్చలించి తెల్పెఁ దత్కథల్ వచఃప్రయోగచాతురిన్. 126

క. ఈకథలు ముగియునంతకు, నాకాంతకమర్త్యభేదిన క్రందరబా
హాకథలుముగిసె నరథా, రాజ్యపతిచిత్రసనవిసలరాట్నుతు చేతన్. 127

ఉ. వెచ్చె సమిన్నభంబు పరివీతశరార్చుల దైత్యసైన్యముల్
విచ్చె హతావశిష్టులును వేలుపుమొత్తము రాకుమారునిన్
మెచ్చె విషాదహర్షములు మేఁగలు మీఱుట లేర్పడం బడం
జొచ్చె నభస్సరత్సర నిషూదనుచూడ్కుల నీలునిప్పులున్. 128

ఉ. అప్పటి బంధువీరవిరహప్రభవంబగు ఖేదమల్కకుం
ముప్పిరిగొల్పి పోవఁ దనమోమును గన్నులుఁ జేవురింపఁగా
నప్పిశితాశనాథుఁ డహహా ధనువేను ధరించు పాటిపో
రెప్పుడు గల్గునో యనఁగ నిస్పృహగాయొనఁ గూడెఁ గ్రక్కనన్. 129

చ. ఆనిహతశేషభీతరథికావళిఁ బేరునఁ జీరి పేరెలుం
గున మనమెల్లరుం గుడుచు కూడు చుఁడీ మనుజుండనంగ నే
మని తలలూపఁ బారెదరొ యంతటి యాదొర లేమి బాసనో
యనిఁబడిరంచు సైనికుల నందఱఁ గూర్చి యుదర్చిరాకృతిన్. 130

లయవిభాతి.

వెలుఁగుచు నతండు తనకెలకులన వచ్చునృపదళితరథిజాతరథములకు నిజమాయా
బలము మెయి మున్నెపుడు గలరధికసారథులు గలిగి కఠినాట్టహాసములు సెలఁగ గాఁ గో
ల్తలకెదురు జేయఁగని కలఁగి సురకోటిమది బలుబెడదవచ్చెయిఁక గెలుపరిదివీరల్
దొలుతఁ దలపాటుఁ దమపలుదలలపాటు లిటుగలుగవనిపింతురటె గలబెడఁగులందున్.

చ. అనితలపోసి చూత మెటులయ్యెడు నోయని వేఁచియుండఁగా
నినకులదీపకుండుఁ దనయేటులఁ బోయినవారికిం బున
గ్జననము తోన కల్గుటకు సంశయవిస్మయ రూషితాత్ముఁ డ
య్యును మది జీరికిం బోనక యుచ్చరవంబుగ శంఖమెత్తినన్. 132

చ. చినిఁగె దిశల్ నభంబవిసెఁ జిందరవందరయై గ్రహస్థితుల్
సనియె వియర్ఝురం బొలికెఁ జాలెసురాళి కపాయశంక కం
పనమున భూతముల్ మిడిసె భైరవుఁడుల్కె విధాత బెగ్గిలెం
బనివడిఁ దేర్పఁ దేర్ప నలభర్గుని కౌఁగిట దుర్గమూర్ఛిలెన్. 133

క. మాయావిషహరమంత్ర, ప్రాయాగత పాంచజన్య భవహుంకార
ప్రాయాగత మహిమనత, న్మాయారథిసృష్టి యంతమాయంబయ్యెన్. 134

వ. అట్టి మహాఘోషంబు నిజరోషంబునకు దోహదవిశేషంబుగాఁగొని మనుజవిభుండు
దనుజవిభుమీఁద నురవడించిన. 135

ఉ. సంతసమ నెచ్చరించి ననుసంగరకేళికి బిల్చికొన్న నీ
చింకము మెచ్చితిన్ విడిచిపెట్టెద బొమ్మనియియ్యకొంటి నీ
బొంకులదేహమున్ విడువు పోరకపోయెదవంచు రాజుతో
పొంకుర శేఖరోపశితదృగంచలుఁడై రొదిరించినిల్చెనన్. 136

ఉ. ఎక్కటి కయ్యమయ్యె నపుడిద్దరకు న్మఱివారిదిక్కులం
జెక్కులు తూపు లుప్పతిలి పెద్దలుపిల్చిన పిన్నపాప ల
క్కిక్కన మండ దూరుచుఁ దదంస తటంబులకెక్కఁ బారుచుం
జెక్కులు చీరుచున్ నడుమ జివ్వకుఁ జీరుచు నుండె నచ్చుగన్. 137

ఉ. అప్పటికింత తెప్పిరి తదారవ విహ్వలశక్రముఖ్యుల
ల్లప్పటి తేఁకలేవెదకి యారథిసారథిసృష్టిక్రమ్మరం
దప్పట నూడ జూడఁ దమతత్కుఁడప్పుడు చెప్పె తోనికిం
జెప్పక శాంబరీమారము శ్రీహరిశంఖజ శంఖమిమిచ్చెన్. 138

గీ. మహిమజూచిసంతు మాయాహారంబని, పిదపదెలిసె రాజుమొదలదాని
బాంచజన్యభజనభక్తుఁడై సురశిల్పి, వడసెనెతేఁగి వేడ్కఁ బడిరిసురలు 139

క. రథిసారథిరహితములా, రథములు వరశక్తి శరపరంపర రతో
[illegible] దోడు కుటియఁగ, ప్రధనము సుకుమారునకును భరమైపెరిగెన్. 140

[illegible] మించినదిమొద[illegible] మనకుమార గగనకాసార యుద్ధంబు వియచ్చరవిరుద్ధం
బై చాలు[illegible] సహస్రాతుపీక్షావిద్ధంబై యెడనెడ నితరేతరపరాక్రమ [illegible] ధసమ
భివృద్ధంబై వెలుంగుచుం జెలంగుచునుండె నందు. 141

[illegible] భాసనార్జి తాహులభ్రమింగ నధిపకోదండభూహారిరథములు
[illegible] చరేపా[illegible] యుక్తదంతులఁ గూల్చె జననాథ కార్ముకజన్యహారులు
దనుజ బాణాసనోద్ధతమైన చిచ్చార్చె నృపధనుర్భవమైన నీళ్ళవరద
సురశరాసేద్ధమైన చీఁకటిసంచె భూపచాపజమైన ప్రొద్దువెలుఁగు
పలలభుక్కల్పితాస్త్ర [illegible] పాంగ్పితంబు నవనిపతిముక్తకులిశాస్త్రమపహరించె
నస్రపము పేరియస్త్రంబునా[illegible] రంబు రాజకరవాసవాస్త్రప గాజిఁగడపె. 142

క. తుదినసుర శక్తివైచిన, గదనధురంధరుఁడు [illegible] గొనిపైపై
[illegible] సహస్రము విడచెం, [illegible] గటాకిఁ బొడిచె బొమముడిముడి
[illegible] మూలనరి [illegible] యుకయిలయుక రొుక [illegible] తొలివడక రయం
ననల [illegible] తాకిన [illegible] మూర్ఛ [illegible] నియొత్తిఁగ నృపా.

గీ. ఇటులు నిటల ఘటిత, కుటిల భ్రుకుటియైన మొగము తోడ వీరమూర్ఛనున్న
తండ్రిక య్యమపుడు తానందికొని సుతు, మారుఁడట్టహాస ఘోరభంగి. 145

ఉ. విల్లురమంగఁ జేసి యొక వేఁడిశరం బరివోసి యేసి య
బ్బల్లిదు ప్రక్కనొంచిన నపాయపు టూపిరికుట్టిచట్టి మూ
ర్ఛిల్లి యొకింతలోఁ దెలిసి చిచ్చులుమూఁడును మూఁడు మోములం
జెల్లి వెలుంగు శూలమునఁ జిన్నదొరం బలు మూర్ఛముంచినన్. 146

గీ. అసురవిభుఁజూచి మునినాధుడొట్టవిడచి, వెడలెననివెత్తిరాకుండ బుడిమి తోఁదు
తెలిసిగదఁగొన్న రిపుశక్తిదిగిచివైచి, మతియొరఁగిక్రమ్మరందేటి యురక నిలచి. 147

మ. దితిజేంద్రాతిశయంబు దద్రధరణోద్రేకంబు దత్తాదృశో
ద్ధతయోధాదిక విభ్రమంబుఁగని యేతస్మాత్రబాణోత్కరం
బు తరంబా యివిచక్కఁ బెట్టనని శంభుబ్రహ్మసంభావితా
త్ముత నారాయణ దైవతంబయిన యస్త్రంబుం బ్రయోగించినన్. 148

శా. ఆయస్త్రంబఖిలాస్త్రశక్తిజనకం బత్యుగ్రసారం బఖి
ప్రాయజ్ఞంబు సమస్త సాధనరధవ్రాతంబులోఁ గూడఁద
న్మాయాజేయులదానవేయులను భస్మప్రాయులంజేసి దై
తేయాధ్యక్షు శిరంబుద్రుంచికటువృత్తిం గుక్షి భేదించినన్. 149

క. దుడిదుడి వెడలెదుదానవు, కడుపోకలోకమని మెలఁగిగంధర్వాదుల్
తడవుండమిఁ జెడిరంతటఁ, బొడి సఁదదస్త్రమసుర బొంగియుదేరన్. 150

సీ. ఇత్తెరంగున నమ్మహాస్త్రరసాధనం బసురదాహక లీల లాచరించి
యుపశమింప నృపాలుఁడు త్రాటితత్రిశూలంబు బాహాంతరాళంబు తడవి
తేర్పఁదేరికుమారుఁ డార్పుతో దిగ్గనలేచి నల్దిక్కులుచూచియాడ
నగినారదుఁడుపిల్చి నారాయణాస్త్రప్రభావంబుమ్రొక్కి యుపన్యసించె
నతఁడు మానికి తొనికినతులొనర్చి, రాజుసుతు,గౌఁగలించి నారదునకరఁగ
దపసి యిరువుర దీవించెఁదపన కులుల, వారిపైఁ బుష్పవృష్టియవ్వారిగురిసె. 151

(కందద్వయగర్భిత భాస్కరవిలసితము)

పంచవదను నలువుల్ దిశలించెన్ భాస్కరవిలసిత మెలమిరహించెన్
గొంచక విబుధవిభుఁడరుదెంచెన్ గొప్పసురలు నృపతిలకులగాంచెన్
మించెఁ బ్రణయ పరిరంభముపెంచెన్ మ్రొక్కులఁ బ్రియములుపిదప వరించెన్
బొంచి కనినజయకందము లెంచెన్ బోరి తెరఁగులిటు లెలమివహించెన్. 152

యిందు కందద్వయవిభాగము.

క. పంచవదను నలువల్ దిశ, లించెన్ భాస్కరవిలసితమెలమిరహించెన్
గొంచకవిబుధవిభుండరు, దెంచెం గొప్పసురలు నృపతిలకులగాంచెన్. 153

క. మించెబ్రణయపరిరంభము, పెంచెన్ మ్రొక్కులు బ్రియములు పిదపవరించెన్
బొంచికనినజయకందము, లెంచెంబోరి తెరగులిటులెలమిపహించెన్. 154

వ. అనినవిని జనమేజయుండవ్వలికథాక్రమంబెట్టిదనిన. 155

మ. నతనానానరపాలమౌళివిలసన్మాణిక్యనీరాజనాం
చితపాదా దళితారివీరజయలక్ష్మీగేహ బాహా
బలప్రతిభానిర్జిత హేమగర్భనృప సర్వక్ష్మాతమాపాలసం
శ్రితమందార మహీజ భూధరణ శేషీభూతమాద్యద్భుజా. 156

క. ధేరీభూరిధణంధణ, ఘోరారవకుపితగంధకుంభిమదాంభో
ధారాఘుటితధునీకలి, తారామవిహార విజయయాత్రాభరణా.

దధోద్ధతవృత్తము. 157

గారితారిణితకంజబాంధవా, బ్జారివానిదినయామినీభ్రమా
చారచారుసుయశః ప్రతాపసం, చారదూరితరసాసలీభయా. 158

---

ఇది శ్రీమత్తి— తోళప్పాచార్యచరణసరసిరుహసేవాసమాలబ్ధసామ్రాజ్యధా
రేయ నిజకావ్యాభిరక్షాయమాన యెల్లభూపురందరవరనందన మట్లనంతమహీ
నాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబను ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

## తృతీయాశ్వాసము.

క. శ్రీచోడవంశభవ యహి, తాచారభిదాప్రచండ యయ్యరగండా
భూచర ఖేచరలోచన, గోచరసుమభల్ల మట్లి కోనయయెల్లా. 1

వ. అవధరింపుము మనునందనకథాసుధాధారాధౌతమాన సామేయజయుండగు జనమే
జయునకు శంపాయనుండగు వైశంపాయనుండిట్లనియె. 2

ఉ. వెండియు వజ్రపాణి నృపవీర తపశ్చరణంబు నాఁటి యా
యెండకు వానకుం జలికి నిత్తుశరాసను తోడుగాఁగ నీ
గుండియ యంతగాగ నెరఁగోసిన నాతగ వెంత యట్టి యు
ద్దండత సైచి గండమిది దాటితి నీ వెనరెంత మాపయిన్. 3

మ. అని యారాజు తలంపెఱింగి యజలోకాలోకలీలోత్సవం
బునకే మున్ జనుదేరఁగాఁ జనుట యొప్పంగాదె రమ్మంచు నా
యనఁదోకొంచు బలారి వహ్నియమదైత్యాంభోధిసమ్రాణ్మరు
ద్ధన దేశానులు రా విమానముల వింతల్ సూవుచుం బోవుచున్. 4

సీ. విద్యాధరాదులు వీరునీచే నేఁడు బ్రతికి వచ్చిరి వీరిపాట వినుము
వెన్నెలపాలము నీవియ్యాల కులకతఁ చంద్రుఁడేయీతఁడీ చాయరమ్ము
జలజారి యాఁడుమండలమిదే నీకీర్తి గెరలించు కులకతఁ మరలిచూడు
సహలుసమీరపాశము లెత్తి నీగెల్చు గ్రహగతుల్ చక్కఁగాఁగాఁ జెలాడు
మనుజ వల్లభ సప్తర్షిమండలంబు, వేదసంవాద ముఖరంబు నాదరింపు
శిరసు మిన్నిటఁ దడియంగ శింశుమార, చక్రగతుఁడైన ధ్రువు పెంపు సన్నుతింపు 5

క. ధ్రువ మండలమాదలగా, రవిమండల మడుగుగాగ రాజిలుపదునా
లువు లక్షల యోజనముల, భువనము త్రిదివమిది భోగభూమి నృపాలా. 6

క. కృతకాకృతక త్రితయ, ద్వితయమునకు నట్టనడుమ దీనింగంటే
కృతకాకృతకేతరతా, యుతము మహర్లగము కోటియోజనమున్నృపా. 7

మ. జనలోకంబున నందనాదుల నివాసం బొప్ప నీక్షింపు యో
జనకోటి ద్వితయప్రమాణమిది భూపాలవల్లభుం డాత్మనం
దన యోగ్యంపుగఁ జేయనాఁడ కృపకాప్యంబయ్యె రాజభా

జనముం జూడుమహాశ్చతుర్గుణము రాజన్యా తపోలోకమున్. 8

మ. అపుడ నర్మ్యరకలంబు చోటకృతకాధ్యక్షుంబు కల్పాంత దా
హపుటాయాసము పొక్కపొర్వఁకు రాదంద్రందురే యట్టి బ్ర
హ్మాపదం బల్లదె యారుగోలలది సత్యంబెన్న నన్వర్థమీ
యపరూపంబును జూడఁ గంటివిది భాగ్యంబయ్యె రాజోత్తమా. 9

చ. అనిపలుకన్ నృపాలుఁ డమరాధిప యిక్కడియింపెలెందుఁ జూ
చిన యవి కావనష్టము లశీతలముల్ బహుభానుచంద్ర సం
జనిత మయూఖ సంఘముల సంపడిచందము నొందె నేమొకో
యనవుఁడు మానవేంద్ర వినవా యివి బ్రహ్మసభావిభావముల్. 10

క. వింతలు గావా యివి తెమ, చెంతల జేరంగనీఁ కశీతోష్ణకర
ధ్వాంతంబులైన వెలుఁగులఁ, బంతంబున మొహలువట్టి పాయఁగనూఁకున్. 11

క. తనయులకును మనువులకును, దననేరుపు నూరిపోసి తాల్చిన సర్గం
బున భరము వారిఁ బూనిచి, పనివీరి విధాతయీసభం గొలువుండున్. 12

చ. ప్రమదవనంబునం బ్రియసరస్సుల రత్నకృతంబులైన కు
ట్టిమములఁ జాట్టుకోటలఁ బటిష్ఠయకుడ్యములం బర
స్పరభ్రమద మహాస్వరూపమున పజ్జయు దవ్వునెఱుంగనీని వి
భ్రమముల నాసుధర్మ నొరవట్టు విధాతృపురీనికేతముల్. 13

క. తాదృశ పురహర్మ్యములకుఁ, దాదిలియగును దినకరసుధాకర తేజః
ప్రాదుర్భావనిదానము, హాదీధితి తెలియఁ దరమె యాసభమహిమల్ 14

క. అనిదేవేంద్రుఁడు సకలము వినిపించుచు రాఁగ దివిజవృతుఁడై రాజుం
దనసుతుతో మునిపతితో జనిచొచ్చెం దజ్జగంబు చతురరథగతిన్. 15

గీ. జనవిభుండట్లు బ్రహ్మదేశంబు సొచ్చి, బ్రహ్మనగరంబు దరిసియా బ్రహ్మదేవు
నగరి హజ్జారమున వాహనంబుడిగ్గి, బలభిదాదులుఁ దానును బ్రహ్మసభకు. 16

వ. పిలిపించికొని చేరంబోయినంత. 17

సీ. అనఘ యోగబ్రహ్మలగు సనకసనందన సనత్కుమార సనత్సుజాతు
లను కుమారులు భృగుండును బులస్త్యుండుఁ బులహుఁడు క్రతుండంగి రసుఁడు మరీచి
యును దక్షుఁడును నత్రియును వసిష్ఠుండును నననవబ్రహ్మలై తనరుసుతులు
వెండియు మన్వాది విశ్వకర్తలు ప్రజాప్రియు లూర్ధ్వరేతులు నయనములు
మిహిర మిహికాకరాదిక గ్రహగణంబు, మేషమీనాదిమాంతిమాశేష రాసు
లశ్వినీముఖ్యతారలు నగ్హభంగి, నొలగము సేయ నద్భుతంబాలయమజియు. 18

సీ. శ్రుతు లంగములు బహుస్మృతులు మీమాంస తర్కముఁ బురాణేతిహాసములు నవతి
గానాదివిద్యలు నానాప్రకారభాషలును గాష్ఠాకళాక్షణముహూర్త
దివసవిభావరీతిథిపక్షమాసఋత్వయనహాయనయుగతాప్రభేద
కాలంబు ధర్మార్థకామమోక్షములు దక్షిణ లధ్వరంబులుఁ బ్రణవమంత్ర
వర్గములును బ్రాచ్యవాచీప్రతీచ్యుదీచ్యాదిదిశలు నుజ్జ్వలాభిరామ
మూర్తు లుల్లసిల్ల మోడ్పుఁగే లురముల, నిలిపికొని భజింపఁ గొలకులందు. 19

క. ధృతియును మతియును బుద్ధియు, రతిశబ్దస్పర్శరూపరసగంధాక్ష
స్మృతిసంకల్పవికల్ప, ప్రతతిశమదమములును రూపరమ్యతఁ గొలువన్. 20

సీ. భావగాంభీర్యసంపదవగాధత్వంబు గానరా సప్తపాథోనిధులును
మోహనాంగంబుల మొలచు లేఁజెమటల జలమయత్వము తోఁప సకలనదులుఁ
బ్రబలబాహాంతరప్రథిమఁ గాఠిన్యంబు బయలుద్రొక్కఁగఁ గులపర్వతములు
సురభినిశ్వాసవైఖరిఁ బుష్పజాతులతావు తేర్పడ వనదేవతలును
దృగ్గరిమఁ బాసనతదేటఁ దీర్ఘములును, గటిపృథుత్వంబు వొడసూప గహ్వరియును
దివ్యమూర్తులతోఁ గొల్చి తేజరిల్లఁ, దనరు పరమేష్ఠిఁ బంకజాసనుని గాంచి. 21

వ. వసురుద్రాదిత్యగరుడగంధర్వవిద్యాధరాదులుఁ బావకప్రముఖులు నంతనంత వందనంబులు సేయ నముచిమథనుండు నారదబృహస్పతిపురోగముండై కొంత చేరంజని పరమేష్ఠికిం బ్రణమిల్లి ప్రణవాదినమోంతవచనంబులఁ బ్రస్తుతించి మనుతనూభవుం జూపి నభస్సరాసురసంహారపౌరుషం బుగ్గడించుచుండె నతండును బితామహసభామహావిభవవైలక్షణ్యవిలోకనజనిత విస్మయవిస్మృతసేవాసమయసముచితవ్యాపారుండై సుకుమారుండు కొండొకవడి యూరకుండి పదంపడి తనయునుంగుఁ దండ్రి యక్కొలువుననుండి చేరవచ్చి మన్ననుగ్రహంబున న్నరలఁ దేర్పం దలివొంది.

క. అకరస్పర్శకృతాఖిల, సకలనిటలతారతమ్య సఫలాక్షరతే
ఖక దేవవిాకటాక్షము, వికసిలుఁగా కనుచు నెరఁగి వెండియు బల్కెన్. 22

సీ. పూర్వగీర్వాణులఁ బుట్టించి యామిని యైయుండె నేదేవు కాయ మొకటి
సురసంఘునిర్మాణపరిణామమునఁ బొల్చె దివసమై యేదేవు దేహ మొకటి
పితృదేవతలను గల్పించి సాయంసంధ్య గా నేర్చె నేదేవుగాత్ర మొకటి
బహుమనుష్యులఁ గాంచి ప్రథమసంధ్యాభావమున నిల్చె నేదేవుమూర్తి యొకటి
యతనిని బ్రసన్నునింజేయ నతనిచేతఁ, బావితుఁడఁ గాఁగ నతనికిఁ బ్రణుతి చలుప
నతనివలనఁ బ్రాప్యజ్ఞాన మధిగమింపఁ, గోరుదు నతండు నీవ చుమ్ము భారతీశ. 24

వ. రంగేశ్వరుకొలువునం గనుపట్టినయట్టుగా నతనిం బుట్టించిన దేవుండవై నీవకృపచే
సి తనిన నవ్వి యవ్విరించి యగునగు బహువిధతపంబులకతన నతనిం బుట్టింపంగం
టి ముక్కంటి మొదలేనుదుప తదీయసన్నిధానంబమరి యట్లుండుదు నది య
ట్లుండె మదీయసర్గంబులు కొన్నియుగ్గడించి తదనుగుణ మనోరథంబులు నీకుం గ
లుగం జలిపినాఁడవు. 25

ఉ. వేల్పులకంటెను న్నసురవీరుల మేను సృజించు టెంచి సం
కల్పము మా ప్రసన్నతఁగా నొనరించితి నన్న నీవచః
కల్పన కర్థ మేమి యలకయ్యము మాకు ననిష్టమంచు నో
యల్పులఁ ద్రుంచి లోకములయాపఁ దీర్చితి వింత యొప్పదే. 26

వ. ఇంకొక్క యెచ్చుమాటయుం గలదు. ప్రాప్యజ్ఞాన మధిగమింపఁ దలంతు నంటివి.

క. చను నేప్రాప్యాంశమునకుఁ, జనవరి నటు పలుకఁ బ్రాప్యసంపద యెల్ల
న్మనుమున్న గఁ దలమోపునఁ, గొనిచనవా మమ్ము నడిగి కొనివచ్చితివా. 28

గీ. అనుచు శ్రీరంగధామంబు నాత్మనిడి కృ, తాంజలియుఁ బూర్ణపులకుఁడు నానిమీలి
తాక్షుఁడును నైపదంపడి హర్షబాష్ప, భర మెసఁగ నెప్పలెల్తి భూపాలుఁ జూచి.

ఉ. ఏనును చుండు రంగపతి యింకిట మాపటికైన వచ్చునా
యీమొగ మాయలంతినగ వాతలయంపిగ నిద్దబాహు వా
వామభుజంబు చాఁపు మఱవంజన దెప్పుడు వచ్చు రేయి యే
నీమముఁ బట్టి నాతపము నీదగునో యతిలోకపార్థివా. 30

పద్మనాభవృత్తము.

రావన్న రాజన్యరత్నంబ నీయట్టి రాజర్షియున్నాఁడె నాసృష్టియందున్
దైవంబు నీసొమ్ముగాఁ జేయఁ గంటే కదా పద్మనాభావతారాశ్రయంబై
నీవంశమున్ బెద్దవర్థిల్లు మామీఁది నెయ్యంబు డెంపంబునన్నిల్పు మంచుం
దీవించి సత్కారసంప్రీతు నమ్మేదినీలోక సంరక్షకు న్వేగనంపెన్. 31

వ. ఇంద్రాదులుం దమ నివాసంబుల కరుగ ననుజ్ఞాతులైరి. అంతం గుమారసమేతంబు
గా నతిలోక భూలోకేశ్వరుండు. 32

గీ. నలువయడుగుల ప్రాలి సభ్యులకు మ్రొక్కి, గురువకెరఁగి సారథునకుఁగరము మొగిచి
మరలి రథమెక్కి రూఢవిమానశక్ర, ముఖులతో నమరావతి ప్రోలు ప్రాలి. 33

వ. గగనతరంగిణిం గనుంగొని. 34

క. బలజంభరుధిరగరవవి, నొలఁన్గిన పెన్నిటి రేకతో నీనడి యొం

తెలియనెను నిర్వృత్కుంతమను, లలాటరేఖావిభాసి లలనల నసుచున్. 35

క. అని తత్పుణ్యోత్సవకములఁ, గొని కొనియాటలకు నిలిచికొలిచి నదినీవ్వ
డ్కాని యమరావతి సొచ్చెం, జనపతి యొక యెదురుకోలుసంపదఁగనుచున్. 36

వ. అది పురందరనచనసమాగమంబున జయంతుఁ డతనికొనర్చిన యెదురుకోలు వినుమి త్తెఱంగునఁ దత్పురప్రవేశంబు చేసి. 37

సీ. నందనవనవాసనలసొంపువిలసింప నలసంపుఁ జలిగాడ్పులనుసరింప
నెక్కొనమణిహర్మ్య మేచాయ యాచాయ మేచాయఁగలసతు ల్మెఱసిచూడఁ
దనపేరఁ దెగి యందు మనువారు దనవారితనమూఱఁ జెఱునవ్వుదనికిమ్రొక్క
యజ్ఞభిక్షాదాత యని వేగ మనురాగ మునయాగఫలభాగు లనునుతింపఁ
దనకు సురరాజు నిజరాజధానివైభ, వములు చూపుచు సంగడివచ్చు నపుడు
దను నతఁడు మించిచనసోడఁ దానుసతని, మించిచననోడఁ జౌరులీక్షించిరలరి. 38

గీ. ఇవ్విధంబున సాహార్ద మెలయ నరిగి, నగరిమొగసాలకడ వాహనములు డిగ్గి
పెద్దలిద్దఱు ముంపటఁ బెరసి కేలుఁ, గేలఁగొని వేత్రిహస్తులు మ్రోలమెఱయ. 39

క. సుకుమారుండు జయంతుఁడు, నొకజో డయి రా డిగీశు లొకగుంపై రా
నొక రౌనసఁ గక్ష్యాంతర, వికస్వరశ్రీలు చూడ్కి విందులు సేయన్. 40

శా. చేఁజొచ్చి సుధర్మయందు విలసచ్చింతామణీపీఠికం
దారాసీనులుగా దిగీశు లుచితస్థానంబు లందుండఁగా
ధీరోదారకు మారులొక్కమణి వేదిం గూర్చి కూర్చుండఁగా
నారంభాసతు లాడి రెచ్చుజతి హాహాహూహూలు ల్పాడఁగన్, 41

క. ఇవ్విధమున నుత్సవముల,నవ్వుల నితిహాసముల మనఃప్రమదంబు
ల్నివ్వటిలఁ జేసి యింద్రుం, డవ్విభునకు నొసఁగె మణిమయాభరణాదుల్. 42

వ. ఇట్లు బహూకరించి యించుకవడి దలంచి. 43

మ. భుజశౌర్యంబునఁ బెద్దవై హితుఁడవై పౌరానిబంధుండవై
త్రిజగద్రక్షణదీక్షకెక్కితివిఁకేదియిచ్చుమాదీవనల్
నిజమైనర్రిలుమన్న రాజతనుపాళీయౌవనప్రౌఢికి
న్విజయంచే సెను బ్రహ్మపుత్రుఁడు హిమానీరుక్కులగాత్రిమణీ. 44

క. అచ్యుతురాననసూనుం, డచ్చటఁ దానవుడు మొలచి యాశీర్వాదం
బిచ్చెనె యింద్రుఁడు మెఱుఁగులు, దెచ్చెఁగదా ప్రాయమునకుఁ దీవననినన్. 45

గీ. సేనమెచ్చు ననఁగ జిష్ణువరిష్ఠులం, దుపచరించిరతనిను చితవిధుల

నుల్లసిల్లి మునియు నుభయాక్షిముఖ వేసి, నభిమతాసనమున నధివసించి. 46

సీ. విషమసాయకునకు వీజిగిరపేఁ దంటి నేఁడుగా వెనవిల్లు వాఁడు నిలిపెఁ
వసుగంధవహునకుఁ దల చిటచిట దీఅ నేఁడుగా ననుదేఁటి గూడు దెఱచెఁ
బుష్పాకరుని పూర్వపూజకుఁ దెరవుచ్చి నేఁడుగా పూవుఁ గ్రొవ్వాఁడి యయ్యెఁ
గుముదబాంధవుప్రతాపమునకుఁ జలిపాయ నేఁడుగా వెన్నెల వేఁడిఁ బెట్టె
వలపుఁ జల్లవచ్చి వలచిన వలపాక, తపసి తేని శాపకృపలఁ జేసి
కలఁగి తేతె యిట్లు కర్పూరతిలకకు, నేఁడుగా పునర్జనికి ఫలించె. 47

వ. అని పూర్వోక్తరకథాసంఘటనంబున కుపక్రమించి. 48

చ. వరయూన నట్టె రెంపగుభవంబున నట్టె సురేంద్రుకొల్వున
చ్చరయటై నిన్ను మన్మథచంకంవదుఁ జేసి తరించె నట్టె యి
ట్టిరె మగ లెందు నెక్కడి పతివ్రతపాదనగంబు లేటిమం
దర మని నారదుండు మమునందను ధీరత మెచ్చి యిట్లనన్. 49

సీ. నిర్జరేశ్వరసఖ నీచేయునాతిశ్రేయములను బనిగామిఁ దమమునంబు
లరవీకులై మన్మథాదులు దిరుగంగఁ జిక్కిన కర్పూరతిలక నిన్నుఁ
గలఁచిన కలుపాకకపట రవులొక్కనఁ దాల్మిఁబడి వెన్నెలలఁబట్టి పట్టిఁ గ్రుక్కి
తపమున నీకుమోహపుదేవి కాఁగోరి చనితపోవనిఁ గణ్వమునికి మ్రొక్కి
యనుమతికి డాయ నివి మాయ లవనిఁ బుట్టు, మని శపించిన నతఁడు దే...
శాపమిది నీతపఃఫలరూప మబల, బ్రదుకుమనఁ జేరెఁ జెలిపిందు వెదకికొనుచు. 50

క. చేరిన చెలులకుఁ జేరువ, నాబుషి నిర్మించి చూపి యాదెకంటిరె క
ర్పూరతరువాటి మీక, ర్పూరతిలక యచటఁ బుట్టఁ బొందని యని చెన్. 51

చ. అనిచిన సార్వభౌజలపదాదిసఖీశత మోమహాత్మ్య యీ
వనితకు గోరుచుట్టిపయి వచ్చిన రోఁకటిపోటు తప్పెఁ బో
మ్మనుటయ కాక రక్షకుఁడవైతి గదా యని పొవుచుం జామీ
మన కెదురయ్యె నేననిన మాటకుఁ బొంగెలతాంగియుంన్ మదిన్. 52

క. భూమండలేశ గగనస, రోమహిమకు మున్ను వచ్చిరో రారాకతల్
దామెఱుక చేసి కొనరవి, యెవో యిట్లగునో కంటిమేయ... వారున్. 53

కవిరాజవిరాజితము.

అటు లపు డచ్చర లచ్చెలితోఁ జని యక్కడ నెప్పిన నీసునరా
జట కవిరాజవిరాజితధారిణి యత్కలమాకర జైత్యసము

త్రుటన చణున్నిను జూడఁ గవచ్చుచుఁ గ్రోపన తావిని పొ మ్మిఁక మే
లిటు లగు టొ ప్పవ నప్పెనితోఁ జనియె న్మునిపాలికిఁ గామినియున్. 54

క. మునిరాజు తనమనోవీ, క్షణచేయుటఁ జేసి మానసంబగునమ్మో
హానవనమున నొకకపురపు, టనఁటి మొవల నుండెఁ బెనుబయల్గల నీడన్. 55

ఉ. చూచె వనీవిభూతి యెడసొచ్చిన నిద్దుర కన్నమూయను
న్నేచె మెఱుంగు లెల్లెడల నింపఁ దళుక్కునఁ దోఁచి మాయమై
తోఁచె సఖీసకాశరుచిఁ దొయ్యలి యమ్ముని మూవలింపఁగా
మోచె సమీపపుంగదళి మోహనగర్భము మెచ్చనచ్చరల్. 56

తరల. మరునితూపునుబోని నెచ్చెలి మాయమైనవు డచ్చరల్
తరళముల్తమప్రాణము ల్వదిలంబుగాఁ గనఁబట్టఁగా
వెరవుసేరని నిల్వువ్రాసిన వేలుపైనను నేర్చునే
మరలఁదెచ్చినయట్టు లమ్ముని ప్రాణఁజూపిన మెచ్చరే. 57

మ. అటు లాశ్చర్యపుమెచ్చుచో నతనిరంభాదల్ప శంసార్హమా
ఘటనం గొల్చుచుఁ దద్విశాలవలయాకారస్థిరద్యూగ్గుహా
చ్ఛటపై బారలు సాచు దీర్ఘవిపులాజస్రచ్ఛదశ్రేణిచేఁ
బటపుంబందిరి వెట్టికొన్న వనరంభం జూచి వర్ణించుచున్ 58

క. అప్పా కపురపు దుమ్మా, యప్పాండిమ కాక నీకుమది నలుగుదువే
యప్పాడిగఁ జెలికిచ్చిన, యప్పా భరమెత్తె నిది మనంబా రంభా. 59

క. అనియాపేరను గడుపున, మినమిన మన మంచిరాచమెచ్చులపేరుం
గనఁ దగువావులఁ దేర్కొని, మునివనసౌభాగ్యమహిమమును గని మఱియున్. 60

క. వని కిట్టి సిరియె కాఁగల, పనికై చెలి కపురు నొప్పపాటు గదురవే
యనఁటి కిటు దివ్యగర్భమె, మునిమహిమకుఁ జేతులెత్తి మ్రొక్కెద మనఁగన్ 61

సీ. కపురంపుఁ బలుకులు గలగలరాలుట క్రొత్త చిట్టుములు రక్కొనుట నెఱపఁ
బయిపాటుగా డిగ్గు పవనాంకురంబులు బడలికయుమార్పుల బాగు మోవ
వలపాని వ్రాలిన యొలదేఁటి వాచవి కందిన మనుబెల్లయంద మొంద
నిలిచిన నిలుకడ చలువచప్పరములో ముని యున్కిఁ బవళింపకునికిఁ దెలుపఁ
దొమ్మిదిముహూర్తములు మోచెఁగమ్మకదళి, గర్భమామీఁదఁ బైపొరల్గలయ విరిసెఁ
బుట్టె నొక పుట్టుఁగపురంపుబొట్టు బిడ్డ, క్రొమ్మెఱుఁగు చెక్కిచేసిన బొమ్మవోలె.

క. కన్నకడు పప్రుడు రంభకు, మున్నఁబసముఁ దిన్నఁదనము నూల్కొలిపెఁ బగం

జిన్నపకు చున్నరంభకుఁ, జెన్నారఁగ ముద్దువచ్చి చేతికి వచ్చెన్. 63

సీ. ఆరంభయలమంగ నంపంపుఁజెయి సాచి గిలిగింత లలచంద్రకళకుఁ గొలుపు
నాచంద్రకళ వొంగి యమృతమొల్కఁగఁ బల్కు చెవులపండువు లూర్వసికి గడించు
నాయూర్వసి కరంగి యడుగుఁదామరఁదాల్చి చికిలివేడుకలు మేనకకు నడపు
నామేనక చెలంగ నడటుఁజూపులు వన్ని కనుబండువులు వరూధినికిఁబెను చు
నిన్ననే శిల్పి కల్పించెఁ జిన్నిమెఱుఁగు, గమ్మఁదావులనీరంభ కడుపుసొచ్చి
యనఁగ నల్లనిగో నని మునికటాక్షు, మచ్చరలకెల్లఁ జూపు నయ్యనుఁగుబొమ్మ. 64

గీ. పాడముప్రాయంబుశకునంబునడుముద్రొక్క, వెడలుబాల్యంబుజడిసినడుముద్రొక్క
నమ్మముద్దాడ నడుమీద్దెనమ్మయనుచు, నెత్తిముద్దాడెఁ జెలిచెల్వనిలకుడించి. 65

వ. అయ్యవసరంబున. 66

మ. దశమైకాదశలగ్నవేలలనుమీఁదంగన్వుఁ డక్కన్యకుం
దశమైకాదశవాసరోత్సవము లుద్వాహాదులుం జేయునాఁ
డుశతానందసమానుఁ డమ్మఘువుపేడుం బోలెఁ బొల్పొందసౌ
ధశతభ్రాజితసర్వవస్తువుల నుద్యానంబుఁ జేసెన్నృపా. 67

క. ఒకయిలు విలసిలు వైవా, హికమై యతికనకమై యనేకమణీక
ర్మకమై సకలకనుద్రాభ, మకమై తీరై సుధర్మమారై యొందున్. 68

వ. అది యట్లుండె ననంతరంబ యమ్మౌని యనుజ్ఞ నచ్చర లచ్చెలువకు నభ్యంగమజ్జనా
ద్యుపచారంబు లాచరించువారై నలయువస్తువులు మేడకుం జని తెచ్చిరందు. 69

సీ. నలుఁగు వెట్ట నురంబునకుఁ బూపచన్నులు బలిసి క్రిక్కిఱియఁ జే వెలలవపుడు
సిరసంటికొన గోళ్ళఁ జిక్కువాపిన కురుల్కానలు సాగిన బారఁ గొలఁవ దపుడు
గంధామలకమిషఁ గదలింపఁ దొడవులు తిరుగఁ బుట్టఁగఁ దివ్వఁదీఱ దపుడు
కట్టు మేనపిావోడకంబార్చి మడుగులు పొడవుదోఁచినఁ దాల్పఁబోల దపుడు
చాలు ననుచు సరససమయోచితోక్తులు, జరపి యుచితవిధులు చలిపి చెలులు
తను నలంకరింప దశమలగ్నమునకు, నిండు జవ్వనమున నిలిచె బాల. 70

గీ. కురులు గూడి ఘనోదయస్ఫురణ చూప, స్తనిత మయ్యె నురస్తటం బనఁగ నేల
పాము వ్రేలాడఁగట్టినపగిది మెఱసె, రమణి నూగారు శృంగారరసము గురియ. 71

గీ. మోము చందమామతో మంచిమాటకుఁ, దమ్మిలనుప నేకతమున కున్న
రాయబారితామరలనంగఁ జెవిచెంత, వల్లఁజేరి కన్ను లమరెఁ జెలికి. 72

మ. అపుడా చెల్వయు రాకఁ గంటి మొకనా కాశ్చర్యసంపాదియై
చపలాక్షీహృదయంబుల న్నిలిచె రాజా నిక్కమా చిన్నిప్రా
యపులేఁజన్నులమీఁది యాలివికయే యాసొమ్ములే యట్టిభా
రపుఁబాలిండ్లకు నిండుమేనికిని బర్యాప్తంబు లైయుండెనె. 73

వ. అట్లగుట యబ్బాసంబు గాద వెండియు. 74

ఉ. జవ్వని చెక్కులు న్మెఱుఁగుఁ జన్నులఁ బయ్యెద జాఱు దిక్కుల
న్మవ్వపుసొమ్ములపై మణిఘనం బగు చెక్కులఁ దమ్మఁ జూచి తా
రవ్వటుసీడు గాఁ దనిన యన్నిక సౌందర్యఁ జూచి తేలాకో
యున్నవవాంసి వెట్టఁ దజుఁడిన్వక సృష్టికి సంచు నెంచుచున్. 75

—లయగ్రాహి—

అప్సరలు వేడుకయు నచ్చెరువుఁ జిత్తములఁ జొచ్చి యెడఁ బాయకొక నెచ్చెలులుఁ జోడై
పెచ్చుపెరుఁగంగఁ జనియచ్చటికిఁ గొలంకులను ముచ్చటఁ దలంగడిగి వచ్చిరి యనుష్ఠా
నోచ్చలితుఁడైన ముని యచ్చరితముల్గనప వచ్చెఁ బురుడున్ వెదలనిచ్చెఁ గ్రియలన్నా
ప్రచ్ఛన్నటమీఁదితగవచ్చపడఁగా మొదలి యచ్చెఁ బవేరయపుడిచ్చినటు లుండన్. 76

వ. అట్టి సమయంబున రంభాసంభసంజేరి. 77

సీ. వెన్నెలబయలు పూవులుగాని యాటకుఁ జిగురాకుబోఁడి నీ చిన్నినగవు
దళితపల్లవనివిహారమునకు లేఁదోఁట మొలఁతనీకనుదీఁగ మెఱుఁగుఁజాలు
దప్పసదాఁగురింతలకుఁ జీఁకటిమేడ మగువనీ వేనలి జిగిదెసంగు
తామరకొలను కందర్పుని దోలకు వనితనీ వదన లావణ్యరసము
పెక్కులీల మగల ముక్కంటి దయుకల్గి, కమ్మకత్తి మనసుఁ గన్నవెట్టు
గంపుదొంగ దపుఁడుఁ గరుప్పరతిలక నీ, తీవి మేను లెంకి మానిప్రాను. 78

ఉ. ఆచ్చరమేనినాఁడు నదయాడుదుగో తనయందు నన్న యా
మచ్చికఁ బాయలేక నభమానఘనుయ్య నితంబనుయ్య నూ
నెచ్చెలి యూయిలాటలను నీవగుపావము సోఁక నెయ్యమై
కన్నెఁ దనీయ బుద్ధికిలనా తరువాతఁ బతిప్రపృత్తికెన్. 79

వ. అనిపలుకు నవసరంబున. 80

మ. కన్నని మేనులుం బలికెఁ గిన్నెర కానులు వాలుఁ గన్నులు [illegible]
[illegible] న్నెన్నెలు [illegible] కన్నులు [illegible]

జుమ్మను కొప్పులు గన్నులు చొప్పులు నొప్పఁగ నారగింపఁగా
రమ్మని పిల్వవచ్చి రదురాణ్ముఖిఁ గొంపలు బోనకత్తియల్. 81

ఉ. వచ్చిన నెచ్చటన్మొలచి వచ్చితిరే యన నోలలాడుచు
న్వచ్చితిమమ్మ యేము నొకవారిరుహాకరవీథి నీజటా
భృచ్చతురాననుండు మొలపింపఁగఁ దమ్ములతోడఁ బుట్టిమా
కిచ్చె సుగంధగంధి పవహారకిరీటము లబ్జనామముల్. 82

సీ. అనవిని యచ్చరల్మునిరాజునకు మ్రొక్కి యయ్యనిన్నటఁగోలె ననుఁగుబిడ్డ
చెంతవాయక యుంటి రింతలో నీసృష్టి సాగు టెక్కుడయ్యును జాణఁగాము
కులకటువోదు రెకోలనుసొచ్చియె తెచ్చికొంటిరి నెఱజాణ కొమరుఁగాంపు
ఘనసారలతికి నిచ్చిన తేజమింద్రాణి మెచ్చుసుమ్మన నతండిచ్చగించి
ఆరసి కన్నియ నాకొంటి వారగింప, నరుగు మిది మాకు మాధ్యాహ్నికావసరము
పోయివచ్చెదమనఁ జిన్నిపువు నమర్చె, నతనికిఁ దదాజ్ఞమాఱు జోహారనడపె. 83

చ. అపుడట నుండి యేను గుతుకాగతమానులు గణ్యతాపసా
లపనమనోనుకూలవిధులన్ బలుదీవన లిచ్చియంచితం
గపురపుబొట్టుభామ చెలికత్తియ తౌనన మేడకేగుడు
న్వపులరసంబులై వలచె విందులు చిందుచు రెండుపూఁటలన్. 84

సీ. కమలగంధిపయోజగంధిపంకజగంధు లానందసన్నాహ మచ్చుపంపఁ
బాథోరుహసుగంధిపద్మసుగంధులు ఘనసముల్లసనంబుఁ గడలుకొలుపఁ
గంజగంధిసరోజగంధిసారసగంధు లుపచితంబైతపం బొనరఁ జేయ
సరసిరుహసుగంధిజలజసుగంధులు సుసరమై సుషిరంబు సాగియఁ దేఱ
వపురపాంగవేణీవిభావలయవీథిఁ, గనదనిర్వార్యమూర్తిఁగాయై వనజగంధి
మువ్వెలుఁగులోని పరతత్త్వమోయనంగ, శుద్ధనాట్యంపుఁ దెరవునఁ జూడ్యబొలిచె.

ఉ. కంచియదోయి మూఁపులకుఁ గొప్పులకున్నెటిచూప జోఁటిజో
డంచు లలంకరింప గుఱుతైన కిరీటము వెట్టి జక్కిణీ
సంచున కబ్జగంధి జలజాతసుగంధి మణీమయక్రియ
న్గాంచినఁబుట్టఁ బుట్టెఁ దెఱుక ల్నెఱపెం గొఱవంజి యాటలల్. 86

క. పేరోలగముతలంపుల, పారంబులు వలికి యులికి పడఁజేయుచు నొం
డే రెండేయు నెడ నిన్నిక, నీరాకరుఁ బకుమెంచి నెప్పెలి గలఁచెన్. 87

చ. పగతురు నెయ్యురు న్బిరుదుపాటలలో గెడగూడఁ గేకరున్
సిగసిరసూచెఁ గత్తి మొనచిమ్మను గుమ్మను నేలసోఁకుచు
న్నెగయఁగఁ జొక్కుటాటలకు నేరిచి నీరజగంధిదాపలై
జిగిజిగి మాపురా నెడమచేతన మీసము దువ్వెఁ జిందునన్. 88

గీ. చెలువ కొఱవంజి యొఱుకచేఁ జిన్నవోయి, చిన్ననగవైన నగదయ్యెఁ జింతగొనఁగఁ
గోరజగ గొమ్మ బరిగత్తి గోకి మీస, లారజపుఁ గేక బోఁటికి నమరెనపుడు. 89

వ. అంత భవదీయ రూపరేఖాతిశయంబులు మనంబునం దలంచి తలంచి లతాంతసంత కుంతాధీన స్వాంతయగు కాంతం జూచి చింతించుచుఁ జంద్రకళాదు లుద్యానవన విహారంబులఁ బరాకు సేయం దలంచి తోడ్కొనిపోయి. 90

క. రాచిలుక రాణివాసము, లోఁ జెలి యెలమావి చిన్నియుప్పరిగలపైఁ
జూచితె ముసగసలాడుచుఁ, జూచెద రాతలిరు మెసవుపోరణగంట్లన్. 91

చ. చిలువలఁ బోంచి చంచువులఁ జించు భవన్నవరోమరాజిసా
టుల కివి వచ్చునేలని యెటో కబరీసమతాభిలాషి ని
ర్మలనిజబర్హపఙ్క్తియపరాధము గాచెను గానఁ జూడుమో
లలన శిఖావళావళి హళాహళి కన్నులపండు వయ్యెడున్. 92

క. ఈవిధమున సుమశరశర, ధావనగళదాత్మసక్తధైర్యఁ గనివసి
భూవిహరణకైతవగతి, భావము మఱపుత్తమనుచు భామలు చనఁగన్. 93

ఉ. గబ్బమువంబునందము పొకాలి పికాలి శుకాళి యంతులా
గుబ్బులు రేఁగఁ బుష్పాదులు గొబ్బున జొబ్బిరాలుచుండఁగా
మబ్బున గుజ్జుఁ గెంజిగురు మావిడిచూచి చలించె గబ్బితే
గుబ్బెత కంతుచే బిరుసుఁ గ్రోవి రవుల్కొనెనంచు నయ్యెడన్. 94

క. చిలుక యొకటి యతిరయమున, నెలమామిడి చిగురుఁ గొమ్మ యెక్కొంబలెగాఁ
బొలిచెం గెలిచితి గెలిచితి, గెలిచితినని పలికి కలికి కిలకిలనవ్వన్. 95

క. ఆసమయంబున మకరం, దాసవరసపాన మదపదళినీగానా
భ్యాసవిశేషనిరంతరి, తాసహ్యాత బధిరవృత్తి కాస్పదమయ్యెన్. 96

వ. ఆయ్యవసరంబున. 97

చ. వడిఁ జనఁ జూచి యాతఁ డనివారణఁ దాఁడు నిశాటకోటులన్
మడియఁగ మోఁదు నెత్తుటి సముద్రముఁ దోఁచెనో నింగినాఁగ న
స్పూశు కనునట్టి సస్తగిరిసామి నెలుంగుల [illegible]

ల్లైన నరుణంబులై కనదహీనవిభాతతు లాకసంబునన్. 98

క. రక్షోవీరుల నట సమ, రక్షోణిం జంపి నిజకరకృపాణాస్ర
క్రపతాశనమునకు జగ, చ్చక్షువు చనియె నన నపరజలనిధిఁ జేరెన్. 99

గీ. సోముఁ డేగుదేఱ యామినీకామిని, తన్నలంకరింపఁ దలఁచి లేచి
చిక్కు పాపవచ్చు చికురబంధం బన, నిండెఁ దమము కమలజాండపుటము. 100

వ. ఇప్పగిది జారిణీజారచోరవారమానసకాలుష్యంబు వెల్లివిఱిసి యజాండకరండంబు నిండు చందంబునం దమస్సముదయంబులుదయంబునొందు సమయంబున. 101

సీ. పూర్వదిగీశగంధర్వవధూళిఁ దనర్చు పికిలిపూవుఁదలాటమొకొ యనంగఁ
బొడుపుగుబ్బలిరాచకొడుకు చుట్టినయట్టి వలిపచందురుకావిపాగయనఁగ
దర్పకజైత్రయాత్రావార్తఁ జైత్రుఁ డగ్గడిఁ జాటు తలిరు జేగంటయనఁగఁ
జిన్నిరేప్రోయాలు వెన్నెలప్రాలు జల్లించు బంగరవు జల్లెడ యనంగ
నంతఁ దోఁచెఁ గతిపయప్రయాణానుగాం, భోనిధానవిదితమానసాను
రాగ సూచకాహిరాట్ఫణామణిమహో, వహనసహనవీచి తుహినరోచి. 102

వ. అంతనంతకంతకుం బొడవై పొడవై పొడవై పురం బొంకం బగుమృగాంకంబు యామినీకామినీ పురాతనవిరహిసమయ విషమశరప్రసవమార్గణవర్గక్షతమార్గనిర్గళ దనర్గళరుధిరధారాపూరంబు తోరంబుగా నెంతం బవనేది ఘనీభవించునలుపున నలుపు డెలుపు రాజు విరాజమానమూర్తికాయై గగనవీథిం జనునప్పుడు. 103

క. సలసలఁ దెరలు విరహిహృ, త్కలిలంబులు చలి పిసికి చవిచూచుచు వె
న్నెలపిండి యొక చకోరిక, కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడువంజేసెన్. 104

—* లయగ్రాహి. *—

కోరితొనవిందు దనకోరి జిగియాక చనకోరియని చేరెడు చకోరియు లతాశ్వం
గారములు దేఱెడు నగారములు కృత్రిమనగారములు కేకినయగానములునుం గా
సారములు దేమరకసారములు పుష్పరససారములు మాగభుజసారములు ఘోరా
కారములుదాల్చుసహకారములు తేఁటులప్రకారములుబోఁటికిపికారములు రేఁచెన్.

సీ. అధికచంద్రాతపవ్యథకుఁగా కిరుకేలఁ బయ్యెదఁ దురముపైఁ బట్టుకొనుచు
వర్త్రనల్లీప్రసవములు మెట్టుటకుఁగా కడుగుఁదమ్ములకడ ల్దడవికొనుచుఁ
గటుకోకిలార్భకార్భటికిగాక తటానఁ జెవులలోఁ దర్జను ల్సెక్కికొనుచు
మలయగంధిలమంద మరుదాగతికిఁ గాక చెలికత్తియలఁ జాటుచేసికొనుచు
నన్య లోలుకుమురుని నిశితహేతులుపోని, చిగురుగములు చూచి దిగులుపడుచుఁ

చిఱిమి మెసంగు వేళఁ దఱిఁజేరుటమానవు లోకబాంధవా
భ్యుదయము నూచి వెల్లనయి పోయెదు నీవిటఁ బాంధకోటినా
పదఁ గుదియంగఁ జేయునది పౌరుషరేఖ యటంచు నెంచవే. 116

ఉ. మందుఁడ వయ్యు లోకజనమాన్యుఁడ వీవని నమ్మియుండఁగా
మందసమీర యిప్పగిది మారుఁడు తోడుగ వ్రేలనంటినం
గందు సతీతనూలతను గ్రాచుట నీకొక పౌరుషంబె నీ
మందగుణంబు నెన్నటికి మానకపోవుద నిర్దయాత్మకా. 117

వ. అనునంత. 118

గీ. తమ్మివిరిదాయ యున్మత్తుఁడమ్మ మధువు, కుటిలుఁడో యమ్మ పవనుండు క్రూరుఁడమ్మ
మదనుఁడదయుఁడు గదవమ్మ మానుమమ్మ, ప్రార్థనలు సేయగదవమ్మ బ్రదుకుమమ్మ.

గీ. పాడిగలమారుఁ డాపాటి బాలమేను, చెమరుచేముంచి కొంతరక్షించెఁ గాక
తత్ప్రసవబాణశిఖిశిఖల్తఱుమునపుడు, మనలకన్నీరు పన్నీరు మాన్పఁగలదె. 120

క. కనుపించిన విలువంచియు, దొననుంచిన యమ్ములెత్తి తొడనేర్చియు నీ
కనుచితముగాదె యబలా, జనములఁ గనుమెఱఁగి యేయ శంబరదాయా. 121

క. ఇందమని యింపమనుమని, కందర్పప్రవరుభీతిఁ గడతేర్పక మా
యిందుముఖికి నీకృపయును, మందసమీరా సుగంధమందసమీరా. 122

క. ఇత్తెఱవ చిక్కెఁ జిత్తజు, కత్తులబోనం బరోపకారము కొఱకై
యొత్తిలిపిదె నీదేహము, చిత్తమునం దుంచుమయ్య శీతమయూఖా. 123

ఉ. మందసమీర సైంధవ యమందమరంద ఝరీపరీత మా
కందపుటీవిలాస గిరికందర మందిరకేళిలోల యిం
దిందిరసార్వభౌమ యళిదేవ మిళిందపురందరా పరా
కొందక కావు నీలకచ యున్నది నీవల పెక్కుమాటునన్. 124

వ. అని యమ్మందగమన లందఱు నందంద కందుచుఁ గుందుచు నిందుకందర్ప మందానిలాదుల ననవరతమరందబిందుకుందేందీవరారవిందచందన సందోహసంపాద్యపాద్యాద్యుపచారంబులం బూజించి హెచ్చరించి యచ్చంచరీకాంచితకేశపాశ కాశాపూర్తిఁ దత్ప్రసాదాసాదితంబుగా నక్కునం దార్చియుం జెక్కునం జేర్చియుఁ గన్నులనొత్తియుం జన్నులమెత్తియు హస్తంబులం దుడిచియు మస్తంబున న్మడిఁచియు నుపచరించు చునట్టులై యుండిరి. 125

ఉ. ఇంతను నెంతకాఁగలదొ యోఁజను దేఱకమున్న చిత్తభూ
చింతఁ జిగిర్చి రేఁబవలుఁ జెక్కులపైఁ బులకాంకురంబులై

కాంతకుఁ దోఁచెఁ బెండెమట కాలము పెంపున క్షేమసందియం
బింత యొఱింగి యుండు మిఁకఁ జేమటనత్తుము పెండ్లి నాఁటికిన్. 126

వ. జన్మాంతరంబు లెత్తియైనను భవత్సంయోగంబ కావలయునని యభిలషించియున్న యక్కన్నియం బరిగ్రహించుట యుచితంబు. అదియునుంగాక యమ్మహానుభావుం డగు కణ్వముని యనుంగుంబట్టిఁగాఁ జేపట్టినకతంబునఁ బరిగ్రహించుటయ యుచితంబు. 127

సీ. అని యొప్పఁజెప్పి యమ్మునికుమారకుని నాసుకుమారుఁ దోకొని సురతపస్వి
దేవేంద్రుననుమతిఁ దెచ్చి మాతలియిచ్చిన యరద మెక్కి యయోధ్యకరిగి మదన
జయశంఖ మానందముఁ జదివె హేమాచంద్రకళలకు మున్నాడి కదలివచ్చె
తెల్లదేఁటి యొకండు దెలిసితి మునిసృష్టిగా దాని నదియును గడఁక నట్లు
పలికి ఝంకరించె బలభేది కేలెత్తి, నయభయములు సూపె నరవరునకు
వచ్చియచ్చరలును వజ్రికిఁ గర్పూర తిలక తెఱఁగు మ్రొక్కి తెలిపిరపుడు. 128

శా. ఆమాటల్విని రాజుఁ జూచి జయశంఖాలాపచాతుర్యమున్
హేమాచంద్రకళావచోరసము నీకెట్లుండె నన్నారదుం
డేమీ బొంకెనె యింక వీరిఁ గొనిపో మ్మేమత్తు వైవాహిక
శ్రీమాఖర్వము సూపవేప యని యంచె న్వజ్రి భూవల్లభున్. 129

మాలిని—అనిచిన నతిలోకుం డానతుండై బలారా
త్యనుమతి ననుఁగైరానంబు భూశంఖభృంగం
బన తనుభయమాలి న్యాశయం బింతికిమ్మం
చనునయమయమై రానచ్చర ల్మెచ్చఁబోవన్. 130

మ. తనతేరెక్కి చనంగ నందన వనాంతః కంతుసైన్యంబు భో
రన మ్రోయం గను తన్మనశ్శ్రవణ మూర్ఛల్తెల్పెనత్తోఁటఁ జ
ల్లనిమందు ల్గొనివచ్చి చంద్రకళ తెల్పం దేఁటివారించె న
మ్మొనయంతు ల్వరుసన్ర్వతిస్మరమును ల్మోమైన మూఁడానలన్. 131

వ. అంత నచ్చరలప్పలం జనునప్పుడు భూవిభుం జూచి. 132

క. అదె లీలావతి యూర్వసి, యదె యల్లదె రంభ మనోరథైకాగము సం
పద చూచిచూచి వెసఁబో, యెద రీజీవాతువాస్య యింతికిఁ దెలుపన్ 133

క. అనునప్పుడు బదరీవన, మునపొంతం గణ్వమునితపోభూమి దన
న్ననవిల్తు లెంకసాగ, ధ్యనిరూఢిం దేరునిల్పె నచ్చరలంతిన్. 134

గీ. కతలు పసలి నచ్చినదనంచ లోనఁగిం గఁ, దేరు డిగ్గి రాజు తేఁటిపోయెఁ

దెలిసి వచ్చి వేళ తెలుపంగఁ జని కణ్వు, మునిపదంబు మకుటమున భజించె. 135

వ. అమ్మహర్షియు నాదరించి విధేయంబగు నాతిథేయంబు సలిపి సమాసీనుండైన యజ్జగతీజగదీశ్వరునిరీక్షించి. 136

మానిని—కోపము కాదుగదా యొకకోపునఁ గూఁతలుఁగూసె మహీశ మనో
భూపరివారపరంపర మేసువుపొంతన తావకచిత్తమియ
త్తాపరిమేయమహోన్నతి సత్తటి సత్తెఱఁగై యిఁక మానినికిం
జేపడఁ జంతకు నూతఁగ నూతనచేష్టితమే మటుఁ జేయుటకున్. 137

చ. అనిమునిరాజు రాజు హృదయంబున కింపొనరించి సన్నఁగాఁ
దనుఁ గనుఁగొన్న నయ్యురుపదంబులఁ గంతునిగెల్పుముట్టు వే
చని చెవిచెంత సంకుచిత ఝాంకృతినూకొని విప్పు టెక్కులా
య్యా నిలిపియాడుచుం దపసియాడిన మాటలకాత్మఁ బొంగుచున్. 138

గీ. మనుకుమారుఁ జూచి జననాథ యంపించు, కొనుమనంగ నతఁడు మునికి నెరఁగి
దీవనలు వరించి తా వేడ్కతో వచ్చి, యరదమెక్కె నెక్కెనదియు సెగలు. 139

వ. చతుర్ముఖముఖంబున నతిలోకశబ్దవాచ్యుం డయ్యెనే యితఁడని మునిరాజనురాగం
బునం దనవాకున నిత్యాకునతిశయంబు పునఃపునరాఖ్యాతంబుగాఁ జేయుచుండె న
ది య ట్లుండఁ జంచరీకసారథ్యంబునం బఱచురథంబు విడిదికడ న్నిలిపి. 140

క. డిగి రాజు సారఁగఁ దానుం, బగినంతై నగరుసొచ్చెఁ దద్దివ్యరథం
బగునగు ననరంభాదుల, మగరాయనిఁ గొలువఁ బనివి చుఘుకరమరిగెఁ. 141

వ. అరిగి యనంతరంబ. 142

చ. మదనధనుర్గుణావగుణ మార్గధురంధరమైన తెల్లతు
మ్మెన మదిరాక్షినూపురము మీఁదన టెక్కులతోడి ముత్తియం
బదియన వ్రాలి చెప్పె నరుదందఁగ నచ్చటి మేలువార్తఁ జూ
చెదవిపుడన్నియు న్నృపతి చెంతఁ జెలీ యనుమాట మీటుగన్. 143

ఉ. చెప్పిన తేఁటిఁగాంచి మునిచెయ్ది మనోజునకున్ సహాయమౌ
యప్పచికొండ పుట్టె సకియా యిఁక నోడకుమన్న యన్నలం
దెప్పిరి చూచె నప్పు డొకతీలునునున్న విరాళి బాలయా
త్రిప్పలి నన్నుఁ బెట్టఁ డిఁకఁ దెచ్చు విభున్మరుఁ డంచు వేడుకన్. 144

గీ. అని బహూకరించి యనిచిన నెలదేఁటి, పుడమిఱేని విడిదికడకు నరిగి
ప్రొద్దుపుచ్చుచుండె భోజనముననంత, రమున నిష్టగోష్ఠిఁ బ్రమదమొదవ. 145

వ. అమ్మఱునాఁడు. 146

క. ఉదయమ్మునఁ గల్యాణా, భ్యుదయము గనుఁగొనఁగ వచ్చి పురుహూతాదుల్
తెదుపవనహర్మ్యనిర్మల, పదవి న్వసియించి రటకుఁ బ్రమదం బెసఁగన్. 147

క. నెమ్మిఁ జనుదెంచె నృపజా, తమ్ములతో బంధుజనవితానమ్ములతోఁ
దమ్ములతో వివిధపదా, ర్థమ్ములతో నవ్విదుక్షతల్లియనుజన. 148

వ. అఖిలాంతరీపభూపతులును దాపసాగ్రేసరులును జనుదెంచి రంత. 149

క. తలగడిగి దివ్యతరుణీ, తిలకంబులు చెలికి జిలుఁగుఁ జెలిపావడచే
నలకలఁగల తడి యార్చిరి, తిలకము గనుపట్టినపుడు దిద్దినరీతిన్. 150

క. వనరుహలోచన లెల్లరు, మనమున నివ్వెఱఁగు పడఁగ మణిభూషణచం
దనదివ్యాంబరములమరె, మునిలోకస్వామి కరుణముద్దియమేనన్. 151

గీ. మనుజనాథుఁడేగ మంగళస్నానాది, కములు సలిపి భూషణములు దాల్చి
యమరవిభుఁడు సుతుఁడు నఖిలబాంధవులును, సందడింపఁ గణ్యాసనమునకు. 152

వ. మునివరుండును గర్మపుణ్యాహవాచన మధుపర్కాదికృత్యంబులాచరించె వసిష్ఠాను
మతంబున నమ్మహీమండలాఖండలుం డుద్యద్రత్నపీఠంబుననుండి గుడజీరకంబులు ధ
రించెనట్లగ్గృహదేవతాసన్నిధానంబున గుడజీరకంబులు ధరించి యున్నకన్నియం దో
డ్తెచ్చి చెచ్చెలులు తదభిముఖంబుగాఁ దెరమఱుఁగున నుంచి రంత. 153

క. జనవర గుడజీరకములు, మునునిల్పుమనంగ వజ్రిముద్దియ తెత్తె
న్వనజాక్షిమునునిలిపెఁద, న్ననసఖులపుడువిడ గలిచె గలిచె ననంగన్. 154

క. రతియును రతిపతియును బలె, క్షితిపతియును సతియునుండఁ జెంతఁ బురంధ్రీ
తతియారాత్రులు దాలిచె, నతులితమణిభాజనముల నంతం బ్రీతిన్. 155

క. మునిధారవోసెఁ జంద్రా, ననఁగృష్ణార్పణమటంచు నరనాయకయి
న్వసజాతాననఁ బ్రోవుము, మునుకొని ధర్మార్థకామములతోఁ బ్రీతిన్. 156

వ. అనిన నట్లకాకయని పాణిగ్రహణం బాచరించె. 157

ఉ. ఈశుఁడు సర్వమంగళకు నిందిరకున్మధుసూదనుండు లో
కేశుఁడు వాణికి న్శచికి నింద్రుఁడు గట్టుగతి న్వసిష్ఠుఁడా
నీశుఁడు నయ్యరుంధతియు నెంతయుఁ బ్రేమనొసంగఁ గట్టిను
ర్వీశశిఖావతంసమణి యింతికి మంగళసూత్ర మయ్యెడన్. 158

సీ. భూకాంతుపిమ్మటఁ బురుహూతముఖ్యులు నంబుజాసన వైకుంఠసపదులు
జననాయకు సమీపమున వసిష్ఠాదులు క్రములలో నవచెంతఁ గణ్వముఖులు
నరనాథు చెంగట నవఖండభూపతు ల్బ్రహ్మకుంతలకాంతఁ గమలగంధు
లవనీశుఁ డున్నవో నఖిలబాంధవులును సటపంచి పెపరికాంత్రసంగణంబు

నిక్కి చిరునకేను గొలువులు దెలుపుకొనంగ, బుధమిత్రకేకిధణంధణస్ఫూర్తి మెరయ
జేజే యంచు కీనాదము ల్దివిఁ జెలంగ, బోరనన్నించెఁ దలఁబ్రాలు వోయునపుడు. 159

వ. అనంతరంబ వేదికారోహణంబును బ్రధానహోమంబును నిర్వర్తించి 160

సీ. అలఘు చవికాకల్పిత సమంచిత వీచుల నోలలాడున
జలజముల హాసించుటకుఁ జాలెడు హీరమణీఘృణీస్ఫార
రత్నమయభూషణమ్మయము దాల్చి నలాజలు వ్రేల్చు భూవిభు
న్వాలుగఁ బంచె నగ్రజుఁడు వారి జలోచనతోడ వహ్నికిన్. 161

గీ. సప్తపదముల నడ జనపతి సతిఁజేర్చి, రాజలెమ్మ లెమ్మ రమణి కేను
విన్నవింతు నీవు విన్నపం బంతయు, ననియె నొకతె యొల్లరును నగంగ. 162

వ. ఇవ్విధంబున నాల్గుదినంబులుం బత్తముచిత్రప్రకారంబుల నడపి చతుర్థాహంబున దే
వతాబలిప్రముఖనిఖిలకృత్యమ్ములు నిర్వర్తించి యమ్మహోత్సవానంతరంబున. 163

గీ. ఆమరవల్లభు వవ్వసిష్ఠాదిమునులఁ, బూజఁ దగఁజేసి దీవించి పుడమి ఱేని
చెలువ నళిభక్తి నప్సరోజలజముఖులఁ, గూర్చి సుతనంచెనమ్మని కుంజరంబు. 164

వ. అనవిని జనమేజయుం డవ్వలికథాక్రమం బెట్టిదనిన. 165

ఉ. ఫాలదృగగ్ని స్ఫుటజ్జ్వలనభాపరిభావి భుజాసి దర్శనో
న్మీలిత సాధ్వసస్థగితనిష్ఠురలోచన వైరివీరభూ
పాలక పాలరక్తరసపానపలాశన తుష్టభూతచే
తాళపరీత భైరవపతత్రిగణమార్గ నటత్స్ఫుటవ్రజా. 166

క. ప్రతిదిన నిజపురయజనా, గతబృందారక వితానకరుణా పూరా
ర్జితమహితాశీర్వాదా, వితవితరణగుణమణీ నవీనపయోధీ. 167

సుగంధి- వారిజాక్షు సత్కటాక్ష వర్ధమానవైభవా
సారసారసారిసారచంద్రకాల సద్యశః
పూరపూరితాంతరిపభూపవీరమానసా
గారభూనటత్ప్రతాపగర్వితారిభంజనా. 168




ఇది శ్రీమత్తిరుమల తోడప్పాచార్య చరణసరసీరుహసేవాసమాలబ్ధ సామ్రా
జ్యధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందరవరనం
దన మట్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయం బను
మహాప్రబంధంబునం దృతీయాశ్వాసము.



లోకవార్తలు దెల్పపాకారివచ్చుట యతిలోకుఁ డని ధాత యనుటపిదపఁ
గణ్యమాని యాజ్ఞఁ గకుత్స్థతిలకము, నాథుఁడగుట నిఖిలనరపతులకు
విస్తరించి చెప్పి విభునిదీవించి ని, జేచ్ఛఁ దపసి యొక్కెడేనిఁ జనియె. 7

ఉ. ఈగతినిల్లునించుకొని యించుకసేపటులుండ భానుఁ డ
స్తాగము దాఁటెఁ జీఁకటులజాండకరండము నిండె నిండిన
స్వాగగణంబుఁ దోలుమృగనాయకసంఘముపోలె వెన్నెల
ల్బాగగనాంతరాళములఁ బొంగ సుధాకరుఁ డొప్పెఁ దూర్పునన్. 8

క. వనరుహలోచన చక్రం, దనమునఁ దవమనము మరుఁడువరవీడఁగమ
జ్జనభోజనములు దీర్చి, జనపతి చనుదెంచెఁ గేళిసదనంబునకున్. 9

సీ. అవలించి పిల్చునయ్యంబుజాక్షులు కొంద ఱారిగద్దిగతనం బనుకరింప
గారవించుచుఁ బిల్చు కమలలోచన లెల్ల మావఁతుబలఁగంబు మాడ్కిఁ దనర
మాటికి మొనసూపుమకరధ్వజుఁడు కోలిగడవాని కైవడి కాంతు సేయ
నమ్మైననడనీక యాఁకవెట్టినసిగ్గు సంపూర్ణమదధార సరణిఁ బొదలఁ
కటితటీకోటికింకిణీకారవంబు, పార్శ్వఘంటాధ్వయీనాదపదవిఁ బొదువఁ
దరళలోచన గంధసింధురము పగిదిఁ, గొంతసొంపునఁదోతెంచెఁ గాంతుకడకు. 10

వ. ఇవ్విధంబునం జనుదెంచి తలవంచికొని యున్న యక్కాంత నక్కాంతలాననంబునఁ జిఱునవ్వులు దొలుకఁ దనకుం గనుసన్నలనప్పగించుచుఁ గార్యాంతరంబులు కల్పించుకొని చనునప్పుడు. 11

చ. చెనకనుపక్రమించుఁబతి చెంతఁదొలంగఁగఁజూచు నాతి య
వ్వనితఁ బరాకుసేయు జనవల్లభుఁ డుల్లమభీతినూనుమా
నిని యిటుకొంతసేపు ధరణీపతి తాఁదననేర్పు నాతినే
ర్పును గని నవ్వె నవ్విన సరోరుహలోచన నవ్వె నవ్వినన్. 12

గీ. అంతఁ గొంతభయముపశాంతమైన, లోలలోచన బాగాలు కేలికొసఁగ
మదుపాసఁగఁబోవు నెపమున మనుజవిభుఁడు, చేతఁజెయిఁబట్టి శయ్యపైఁ జేర్చిపలికె.

క. నీవివిభవంబిమ్మని, భావించిన నాకుఁ దాఁచఁబాడియె యనుచుం
సేవించిన సరసోక్తుల, భావము గరఁగించి మఱియుఁ బైపైనంతన్. 14

ఉ. పయ్యెద జాఱఁజేయఁ గరపంకరుహంబులఁ జన్నుదోయికిం
బయ్యెదఁ జేయుఁ బోఁకముడిపట్టునపల్చిన నంతవానిసం
దో[illegible]లిమేనుగానఁబడఁ దోడన డాయఁగఁ గౌఁగిలించి[illegible]

జొయ్యఁ గామతంత్రకలనోదధిఁ జెప్పఁ దేల్చ నయ్యెడన్. 15

క. మనములు కలయుటఁ గనియును, దనువులు కడకడల నుండఁ దగునే యని య
వ్మనములగతిఁ బెనఁగొనిరో, యన గాఢాలింగనంబు లద్భుతమయ్యెన్. 16

వ. అవ్విధంబున లజ్జాభరంబు వదలి పురాతనోపాయంబులు వొదలిన. 17

సీ. అధరాధరామృతం బాస్వాదనము సేయు మోహమందఁగఁ జేసి ముద్దుఁ బెట్టు
పరిహాస మానసాంబురుహసీమ ఘటించు మునిపంట నొయ్యన మోవి నొక్కు
నెడనెడఁ గిల్గింటు సడలిన ముడిగొల్పుఁ జేలాంచలంబునఁ జెమరు తుడుచు
నసదు లేఁబల్కులఁ గొసరి పేరునఁబిల్చుఁ గనుదోయి సౌఖ్యసంక్రమముఁ దేల్చు
గబ్బిగుబ్బల నెదనాటఁ గౌఁగిలించుఁ, బౌరుషములకుఁ గళిరవాభ్యాస మొసఁగుఁ
జేరికొనఁగోట మక్కువఁ జెక్కు నొక్కు, యువతిసురతంబుఁ జల్పునయ్యుత్పలాక్షి.

క. ఎదఁ జేర్చినప్రాణేశుఁడు, మదనాయని పేరుకొన్న మార్మ్రోగ మిడుచు
న్మదిరాక్షితోన వెఱచం, గదయన నుప్పొంగి మరలఁ గౌఁగిటఁ జేర్చెన్. 19

వ. ఇవ్విధంబున మదనకదనాహూయమానమానసు లగుచుఁ గలావిశేషంబులం బొ
దలుచు. 20

క. ముదితయు విభుఁడును నేర్పులు, వదలినఁ గని రపుడు పారవశ్యసుఖంబు
ల్మదినాటి యున్నసుదన, ప్రదరంబును బెఱుక బాళివట్టినభంగిన్. 21

క. ఈవిధమున విహరించుచు, భూవల్లభుఁ డుండెఁ బూవుఁబోఁడియుఁ దానున్
భావభవబ్రహ్మసుభ, హావిష్కృతహృదయు లగుట యవనీనాథా. 22

శా. ఆయిక్ష్వాకుఁడు సిట్టురంగపతికత్యంతంబు నిత్యోత్సవ
శ్రీయోగంబులు చేయుచుం గుజనుల న్శిక్షించి వర్ణాశ్రమా
పాయంబు ల్దెగఁ గోయుచుం గ్రతుహవిర్భాగంబు లింద్రాదికై
తేయారాతుల కెత్తిపోయుచు జగద్గీతప్రభావాఢ్యుఁడై. 23

గీ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద, కాలమున్నఁ జెంపకడలనుండి
కలయనరపువచ్చి గడ్డంబు మీసలు, గప్పగోయబాగుగానవచ్చె. 24

క. హరిభక్తిఁ బౌరుషంబునఁ, బరమైశ్వర్యమునఁ బెద్దప్రభువతఁడు వయః
పరిపాటిఁ బెద్దయైబం, ధురసూక్తిఁ గుమారవరునితో నిట్లనియెన్. 25

మ. సుకుమారాయిక మారణంబు లుడిగెం జుమ్మీ శరాలోకకం
టకఘోరారులమీఁద నల్గి ముడివెట్టంబోయిన న్నైటలాం
తికభూమండలపీఠి ద్రొక్కక యిసీ దృగ్వ్యాప్తిరోధించి మా

టెక్కివ్రేలంబడురా బొమలొక్కుమరునాఁడే చెల్లె మౌఖరుల్. 26

చ. గగనసరస్సరారి యనిఁ గైదువఁబట్టిననాఁడె కంటి నీ
జగడము నేర్పు నీడగు భుజామహిమంబిఁక లోకరక్షకం
బగు నఖిలాంతరీపవలయాంచితమేదిని కెల్ల నీవ రా
జగుమని యక్కుమారుఁ బురియం దభిషిక్తునిజేసి వెండియున్. 27

ఉ. నిశ్చయమొప్పఁ బ్రాంతరమణీ మిదండకులున్నవారు
శ్చలితారు లమ్మగురుఁ జాలక నూర్వ్యాు చిన్నవారు ప్రా
క్పశ్చిమదక్షిణోత్తరవిభాగములన్న ప్రుతై విమక్షికి
న్నిశ్చలభక్తుతై మెలఁగ నిల్పి వినిర్మలచిత్తవృత్తియై. 28

గీ. పరమనిష్ఠరంగపతిఁ గొల్చియుండు నా, రాజు మఱి విమక్షి రాజ్యభోగ
చతురుఁ డయ్యె నితని సతి యంశుమతి యశో, ధనకుమారి దౌహృదంబుఁదాల్చె.

సీ. ఎలకుండలకు రెంటికెక్కుడఁ గల్గెనో నీలకిరీటము ల్నీలవేణి
మూసిపెట్టిరదే మేముకురంబు లొకరెండు తెలిజిల్గు పావడఁ గలువకంటి
జిగురులు రెంటికే తగవునఁ బొడమెనో యందంపుఁ దొట్రుబాటిందువదన
నిదురకుఁ బడఁజొచ్చె నెత్తమ్మి లొకరెండు తెఱఁగిది యెట్లొకో మెఱుఁగుబోఁడి
యనుచు వలిచన్నుఁగవకప్పు మొనలు గంఠ, పాండిమము పాదముల నడబడలిక యును
నెల్లపుడు శయ్యఁగనుదోయి నెలయు నేర్చు, నేరుపున నెచ్చరింతు రన్నెలఁతనఁగఁ.

గీ. మెఱుఁగుఁబోఁడి కుక్షి మెఱుఁగెక్కవచ్చుచో, రమణిభోజనాదరము తొఱంగెఁ
గాంచఁగన్న కలిమిఁ గడుపునిండినవారి, కత్తెఱంగు నిక్కమగునకాదె. 31

క. పన్నిదములరసి గెలుతురు, వెన్నెల తమ మెదుటఁ జూప వెలఁదులు తమలో
నన్నెలఁతమేని తెలుపున, నున్నకురుల నలుపుఁ జెలిపి నూత్నప్రౌఢిన్. 32

చ. వృషభకమృత్ప్రదేశమున వీరవినోదము సల్పఁగోరు దు
ర్వ్యషహపలాశగర్వము డివించి యమర్త్యులఁ బ్రోవఁ జూపు సే
ముషి నిడునీరు గర్భవతి మోవఁగ భావికుమారహృద్య పౌ
రుషమహిమ ప్రవర్తన నిరూపకభూరి మనోరథంబునన్. 33

గీ. ఈవిధంబున సుకుమారు దేవి యతని, జఠరమున నున్న విష్ణుతేజంబు నంశ
మెలయు గర్భంబుఁదాల్చి నెలలు తొమ్మి, దియును మోచి భానుకులంబు తేజరిల్ల.

మ. కనియెం బ్రస్ఫుటసర్వలక్షణ శుభాకారుం గుమారాగ్రణిం
జనిలగ్నగ్రహచారసంపదలు మెచ్చం బంచె దైవజ్ఞులన్

వినవచ్చె న్వినువీథిదిక్కున సుధీవేద్యంబులై యింద్రవా
హనసర్ధిల్లు పురంజయా మను కకుత్స్థాగెల్వును న్వాక్యముల్. 35

ఉ. అట్టియెడన్వసిష్ఠముని యాసుకుమారనృపాలుఁ గాంచి నీ
పుట్టిన బిడ్డకుం జపలఁ బుట్టిననామము తెల్లవింతె వి
న్నట్టి కొలందులే యివిమహార్థము లింతకుఁ డీకఁ జేయునీ
పట్టి జగజ్జిగీషు నిజపౌరుషభవ్యకథాఫలంబునన్. 36

క. అనినఁ బ్రమదాంబునిధిలో, మునుఁగుం దేలుం దదీయములు తరగలు చే
కొని చల్లునెల్లవారికి, జనపతి వదనముల నెవల జడిగొని నిగుడన్. 37

క. అనిమిషగిరి రోహణ గిరు, లినుఁ పగదలఁ జిదియ నడిచి యిచ్చినబాగై
కనకమణు ల్పుత్రోత్సవ, మున విప్రులకొసఁగెఁ జువ్వె భూపతినగరిన్. 38

గీ. దిక్ప్రసాదంబులే కాదు దివ్యఘుసృణ, చందనజలాదికంబు వసంతములును
నఖిలవర్ణాభిమతమయ్యె నమ్మహంబు, పురుడు వెడలెఁ బుణ్యాహవిభూతులలసె. 39

వ. సుకుమారుండును సకలజన గురుజనాదృత నామత్రయప్రచారుండును ధాత్రీసముప
లాలనాధీనుండును బ్రతిదినవర్ధమానుండును నగుచుండె. 40

సీ. జరగు బొమ్మున ఫణిస్వామి నేఁడు జయించు గతినెల్లిమఱిగెల్తుగానియనియొ
నిలుచు లేవంకితో నిజసంగరాగామి పరనృపస్థితి తేటపఱతుననియొ
పాంసు రూషణమొప్ప బలధూళి నినుఁగప్పఁగలచేష్టఫల మాదిఁగాంతుననియొ
యభ్యసించును విద్యలశ్రుతవ్యాఖ్యాత నయిగురూల్లంఘుని నగుదుననియొ
యని యభిజ్ఞులెల్లఁ గొనియాడఁ బెరుఁగుచు, నుచితకాలసంభృతోపనయన
తేజుఁ డక్కుమారదేవుండు మేనికి, సంతరించె నిండుజవ్వనంబు. 41

క. నగనాగకమఠకిటప, న్నగనాథుల కవనిభరము నాఁడు న్నేఁడు
న్మగుడఁగ మోవంబడు నను, వగపుడిగె న్వంశకరుఁడు వాఁడీడేఱన్. 42

ఉ. ఆతని యౌవనోదయము నప్పటి చెల్వము రాజకన్యకా
జాతము శీతలక్రియల సంపదఁ దేలిచె శంబరారికిం
జేతులు నొవకుండ జయసిద్ధి తదీయవిలాసకీర్తి చం
ద్రాతపసాధనంబొకఁడ యంతకుఁ దోడ్పడిచేసె వాసిగన్. 43

ఉ. చొచ్చిపెనంగ కడ్డములు చూపుచు సాదన యొజ్జదొమ్మిసా
మిచ్చిపెనంగు మల్లశతమించుక యాడుచు మేవిదిర్చిన
న్నచ్చిన లావులం జెదరి నల్గడలం బడుసంగడంబులై

వచ్చు విహారశైలములు వానిపరిశ్రమకేళిఁ గేలికిన్. 44

క. ఉఱుకుసువిరా ఖండా గొని, నఱక నయోమయములగు ఘనస్తంభములం
జిఱుతలు గొట్టఁగనగునని, చిఱునగవునఁ జూచుఁ దెచ్చి చెంగట నిడినన్. 45

ఉ. ఆతనిశబ్దభేదిశరమచ్చటికిం బఱతెంచునంచుఁ గా
గా తమయాంధ్రు బిడ్డలును దారునరాతులు మానులైనవా
రాతత చక్రవాళగుహాలందు వసించియు వానియస్త్రవి
ద్యాతిశయంబు పేర్మిఁ దరమాకొనియాడఁ బినాకపాణికిన్. 46

క. కొలఁకులఁ గొండల కెలఁకులఁ, గలకలములు రేఁచురాచకన్నెలఁజలిమం
దులవారల బలవైరులఁ, బొలుపార్చు నతనిచెలువు భుజములబలువున్. 47

క. ఈరీతి జవ్వనపుసిరి, సేరఁ బురంజయుఁడు వీరశృంగారమయా
కారుండై సుకుమారమ, హారాజుం గొల్చియుండ నటవచ్చివెసన్. 48

గీ. త్రెంచిగురువెంద పేరు క్రొమ్మించుపడిన, మేఘమనఁదోఁచు నొకకట్టిమేనిరోఱుకు
ప్రాఁతనెత్తుట మక్కుఁడు వట్టియున్న, యంపఁగమి ముందఱం బెట్టి యడ్డపడియె.

క. పడియున్నవానిఁబతియే, ర్పడఁ గని యిదియేమి లేవరా రారా యె
క్కుడివాఁడవురా మఱిసీ, యడవియునీ పేరుఁ జెప్పరా వినవలఁతున్. 50

ఉ. తుప్పులు వట్టె నేర బలుతూపులు నీగురిగింజదండకుం
దప్పితివేమి నావుఁడు నతండును దగ్గనలేచి దేవరా
యిప్పటి కమ్ములింత చెడియెం గడినోరికిఁ బోదు దూపకుం
దిప్పలనీరె మాగురుల తీయనిపాలురుచింప వేమియున్. 51

క. మంచి గురిగింజ పేరును, బించెపుఁ దలపూవు నింకఁ బెట్టఁగడఁగనా
యంచు శిఖాబర్హంబును, ద్రుంచి శరములెంచి రాజుతో నిట్లనియెన్. 52

సీ. ఇదికొండకొనదాఁటు నిట్టిఁ జందురునిట్టిఁ దలఁకించితాఁకినములికిసామి
యిది బెబ్బులికినల్కి యెదవడ్డ యొకతేటిబాలెంతఁగాచిన కోలయొడయ
యిది కాఱుపోతుతోఁ గదసినజముపోతు నడకించి గెడపినయమ్ముఱాజ
యిది సింగము నడంచి యేనుఁగు విడిపించి దొరవాసినిల్పిన తూపుజయ్య
కడమవియు నిట్టివియకాని కడమలేదు, నల్లపెనువాగులోఁ గొన్ని తెల్లనీటి
యేటిబడిఁ గానఁగాతు నన్నెఱుకు లెల్ల, వీరుఁడని కొల్వవీన గర్వింతునయ్య. 53

క. పులుఁగులలగుడులుగులమగఁ, డెలుఁగుల పిడుగే కలములయెదమడుకు చివం
గులగొంగ బెబ్బులులవిది, బలుమెకముల గండమనఁగఁబడు నీతూపుల్. 54

ఉ. తాఁకిన యమ్ము గాక గుఱిదప్పిన యమ్మొకఁ డెత్తినచ్చినం
గాఁకటు లెత్తి కొట్టుదుము కత్తులనైనను వీళ్లలోనన
ల్పీఁకలవార మేమివియు విల్లునుబట్టి పొలంబు మెట్టియే
పోఁకెటువంటి సంపదలుపోఁ జనుదేరము వీటి కెట్టిచోన్. 56

ఉ. కానకు సంపతెప్పెఱుఁగు గబ్బి మెకంబులు సేరఁ గారుపో
తేనుఁగుదాయ యెల్గుపులి యేసినయేటు సివోయెఁ బోయిన
న్మానితి నిస్సిరోయనుచు మాకులకాయికమైన వేఁట య
య్యో యెనలనుండి తుప్పు దినకుండునె తూపులు వేయి నేటికిన్. 57

క. నిను గడచిన తలిదండ్రులు, విని నాదుందుడుకుఁ దుడిచి విడువంగలరే
యని యేనెరికిఁ జెప్పక, చనుదెంచితి ననఁగ వచ్చె శబరబలంబున్. 58

ఉ. వచ్చి యిదేమి చెప్పకిటు వచ్చితి వప్పుడు కాఱుపోతుతోఁ
బొచ్చెపు బొల్లి వెల్లి మెకము ల్దమ బెబ్బులిఁగూడి గూడెము
ల్సొచ్చి తినంగఁ జెంచు లొకచొప్పున నూర్గురవోయి రన్నవాఁ
డచ్చెరుపాటు సిగ్గు నులయన్వినుచుం దలవ్రేల వైచినన్. 59

మత్తకోకిల.

అప్పుడా సుకుమార భూవిభుఁ డాతనింగని మాయలం
గప్పిరక్కసు లిట్టుచేసిరి గాక యొండెడ నేటుదాఁ
దప్పునో మెకమూరు సొచ్చునె దండిబంటవుగావె నీ
చొప్పు చెప్పక చెప్పుచున్నది శూరవిద్యల నేరుపున్. 60

ఉ. మాయలు మాపురంజయుఁడు మానుచు మానఁగనేల నీకునీ
బోయలకేమి వేఁట గడివోయెనె యేటికిఁ జిన్నవోయె దం
డేయలుఁగమ్మ చక్కఁదము నేపులినీ విలుఁద్రుంచుఁ బోయిరా
రాయిటువంటివా మతులు రాక్షసమాయల కీవుకర్తవే. 61

క. అని వాని మరలవేఁటకుఁ, గొనకొనఁగా నూఱడించి కులధర్మము త
ప్పనిపౌరుషాభిమానం, బున కెంతే గారవించి భూవిభుఁ డంతన్. 62

చ. అడవుల నీవుదాల్చునడి యాలపు సొమ్ముల కీడుగాని మా
తొడవులు వెట్టుమంచుఁ గృపతో మణిమంజుల భూషలాదిగాఁ
నుడుగర లిచ్చినన్వగచు చొయ్యన నందియతండు వైచుమీ
బడనని తప్పనేఁడు వెతఁ బట్టకమానితి వేఁట కానికల్. 63

గీ. ఏటి వెదురుజాతి యేనుంగుతలజాతి, పందికొమ్ముజాతి పాఁపపడగ
జాతిగనిన పూససరకుల కొక్కొక్క, యిల్లు చూపు తెత్తుసెల్లిసామి. 64

క. జల్లులు పునుఁగు జవాదుల, పిల్లులు సింగములపులుల పిల్లలు మాకుం
గొల్లలని తెచ్చియిచ్చినఁ, గొల్లలుగాపన్ని చదురు గొడుఁగులు వినవే. 65

వ. అని మెచ్చు నచ్చెరువుం దగవు నగవుం దేటపడమాటలాడి మఱునాఁటి వేఁట వయినంబున కాయితంబు గమ్మని క్రమ్మరరాజుచేఁ గుమారున కనుజ్ఞయిప్పించి యంపించుకొని తనబలంబుతో వెడలి పురోపకంఠంబున విడిసి రెండవనాఁటి ప్రొద్దుపొడుపుఁ గోరు చుండె. జనవిభుండును మాజారంబు పేరోలగంబు చాలించి యందఱి ననిచి యనుసరించి తనయుండురా నంతిపురంబున కరిగి సముచితప్రకారంబునం బ్రవర్తించె. పురంజయుండును నద్దినశేషంబును నాఁటినిశావిశేషంబును గడపి కడపటఁ గాల్యకరణీయంబులు నడపి మృగయావిహిత వేషభూషితుండై దండితనంబున. 66

గీ. కదలియాల్లునికుడికన్నుపొడుపుఁగొండ, యెక్కనెడనుత్తమాశ్వంబునెక్కి పౌర
మృగయులే తేఱవెడలు నమ్మేటి మగని, సంభ్రమంబునఁ గని నిశాచరవిభుండు. 67

గీ. నిన్నమీయయ్యవలె నుంటి నెఱతనమున, నేఁడుమాయయ్యవలె నున్నవాఁడ వెలమి
నన్నిబాగులు నమరుగాయయ్యనీకు, నని కొలిచిపోయె నవ్వించు చడవితలకు. 68

మ. గహనంబుం గనుపట్టె మమ్మునఖిలాకారోపకారప్రథా
మహనీయంబులఁ జేసి యిట్లు చరతామాంద్యంబు నన్మ్రంతెనా
నహహా యమ్మిగు లింతయుంబెరిఁగి సత్యాంబంటి నన్గల్పక
స్పృహసేవం దలమూపు నోయనఁగ నల్లేయున్న భూజంబులన్. 69

క. ఆవనము చూచి యుత్సా, హావిష్కృత మృగయు సాధనావళుల కథ
నీవారును మావారును, గోవిదశబరయని రాచకొడు కటఁజొరఁగన్. 70

వ. భిల్లవల్లభుం డెల్లరం జూచి సాధనధనులకా విచారించి. 71

క. ఇందుండి పోగువారుం, డం దందు న్వాలల నట్టుఁడ న్వాలియోదా
లందుండి కావు గప్పుడు, ముందటఁ గాలకులను నిలిచి మున్నఱక మెయిన్. 72

క. పొంకించుఁడు మీయిఱ్ఱులఁ, గొంకుల సీసంపుగుండ్లఁ గొమ్ముల నుదలం
బొంకించి దిగువగాలి వ, లంకుల బండంగి బండ్లు పఱపుండనుచున్. 73

క. తనవారు రాజువారును, బనిహరువును దెలుపుకొనుచుఁ బదరక యెన్నం
డొనరించిరో యన నన్నియు, ననువుపఱని కడలవెనుకయయి యతఁడరిగెన్. 74

క. తెర దీము బోను వేఁటల, వరుసలె తీఁగి పెద్దలాగు వరుసగ నడుపం
జోరఁబఱుపఁ బొదువ నడువం, దరుణవయశ్శబరులరరె తగునని పించెన్. 75

ఉ. రాజకుమారుఁడు న్నయనరంజకముల్కృగయావినోదము
ప్రాజిలఁ దేజిఁ దోలుచుఁ గొలంకులఁ దేలుచు వేష్కసేలుచుం
భూజపరంపరాపరిధి భూషితమై బయలున్నచోట రాఁ
గా జగడంబు చేసె నొకకందువఁ బందులు జాగిలంబులన్. 76

సీ. కఱచిన చెవిగూబ గరునూడి గండెండి బెళకపైఁ బడి త్రిప్పుకొలిపెనున్న
బిరుపందు వీఁ పెక్కి పెడతల నమలంగ సుడిసి కంపలఁ బెట్టెఁ జుల్లరంబు
కుక్కకూఁతలు వెట్టికొనఁ బీఁటవదలక గడకంటఁ గాఁ జూచె బడియపంది
లాఁచి తప్పిన జాగిలము గొట్టుకొట్టునఁ గూడినపిడిఁ గూల్చెఁ గొమ్ములాఁడు
వీరచేష్టితసూకరసారమేయ, కఠినసంకులకలహంబు కన్నుదనియఁ
జేసె నౌరౌరయని సంతసించెఁ గెలన, మనుజనాథకుమారుండు మఱియుఁ జూడ 77

ఉ. బయ్యనబాళి తేజులొక పట్టునఁ బట్టిన వారుపట్టెడల్
డుయ్యఁగఁ దూలి బిట్టొఱలి డొల్లఁగఁ గొన్నిటిఁ బట్టెఁ బందులం
దయ్యములం దయాంతకుని దంష్ట్రలు వేర్పడి పట్టినట్టుల
క్కయ్యము...త్తు...విన్నవిహగంబులు డేగలబారిఁ బాఱఁగన్ 78

ఉ. మాకుఁ బతంగభావ మజుమన్నన మున్న లభించె నింకమా
యీకలబల్మి లోకమున కెక్క శశిత్వముఁ దాల్తుమంచు నే
మో కిటికుక్కురధ్వనులు ముట్టినఁ బాఱు శరంబులన్నగు
ల్లోకడఁ బట్టియాడె నటులార్పఁగ నేర్పుఱు లోర్పు తేర్పవన్. 79

వ. వెండియు. 80

ఉ. గండొకపంది తోఁక తొడుకం గడకం బెఱపంది గొట్టిన
న్మొండియమూడి కుక్కతల...బడ నన్వరాహమా
యండపలఁ జెట్టు గుట్టయన కన్నిటి రాచిన నూడదయ్యెనే
తెండటు గొన్నదాని కొల దీనికి టంటెననంగ నెల్లరున్. 81

ఉ. బండెడు నొంటికా డొకమహోద్ధుర ఘుర్ఘురమస్తకంబు దాఁ
జెందుచు...గయ జెండిన చెంగట జింక దాఁటుకా
బొందును బొక్కసం గఱచి బోరగిలంబడ వ్రేలెఁ జూడఁగా
బండిది రొమ్ముగాఁ దెగినము రాఁ బెనఁగెం దినకోఁట వంతనన్. 82

వ. అంత. 83

ఉ. చీఁకటి ముద్దలట్ ... జీవములుంగనినట్లు లున్నయా
క్రేఁకనిపందులన్ శబరవీరుఁడు బల్లెములంది క్రమ్మిచే
బాకులగ్రుద్ది... పయిపాటుల నెచ్చియు మెచ్చు రేఁచఁగా
నేకటదీఱఁజూచు మనుజేంద్రకుమారునిశోడ చేడుకన్. 84

గీ. వీరనామశబరుఁ డోరాచ వేలుప, యెగువ జొంప మొకము దిగువ నలుఁ
నాల్గు దెసలమూగె నను జూచు మొకకోల, యొకటిదాఁకి రెంటి నూర్వ వలయు 85

చ. అని విలువంచి యొక్కొకమహాకిటిఁదూఱఁగ నేయఁ దూపుదాఁ
కినపడిఁ జెంతనున్న యొలుఁగే పులియే యన కోరకోరలం
దునియలుగాఁగ నొక్కొకటి గ్రుంచి శరవ్యవహారముల్వడం
గనికని యింద్రవాహనుఁడు గన్నులమెచ్చెఁ బుళింద వల్లభున్. 86

గీ. ఇట్టిఁగూడఁ దటిమి యెగసినఁ తోడన, నెగసిపట్టి వ్రాలె నిలవ నొకఁడు
చినిఁగిగొంతునగులఁ జేకత్తి జళిపించి, కెడపెఁజేఁగటారిఁ బొడువ నొకఁడు. 87

క. కే...వు...న కొకొఁడేలిక, పాదముపై నానవెట్టి పైఁబడుపోతుం
జేదోయిఁగొమ్ము మోరయు, వేదొరకంబట్టి యొక్కవిటిచెం బెలుచన్. 88

ఉ. పంగిడిఁజిక్క కోదములపజ్జలఁద్రొక్క మూకఁదోలుమా
తంగము నొక్కఁడొంటి మెడఁదట్టి పయింబడి నిల్పియల్లుచే
నంగమెటింగి లేఁదొరిజ యానయుగా దొడబడ్డ యొక్కఁడే
నుంగులవేఁట కింతనిపుణుం డిఁక లేఁడని మెచ్చ నెల్లరున్. 89

గీ. ఇవ్విధమున నెవ్వఁ డేవేఁట మెప్పించె, వానివానిఁ బిలిచి మేనకాని
వేడ్క పెచ్చుపెరుఁగ వేఁటాడ నెడలేక, యుండు నప్పరంజయుండునంత 90

క. మేలురయని వివిధాయుధ, జాలురఁజూడక భుజైకసాధనమృగయా
శీలురసాహసపథజం, ఘాలురఁ జూచుటయునన్న గైకొని వారున్. 91

వ. విక్రమించు సమయంబున. 92

సీ. ఒకచేత నెలుఁగొంటనొకకొండగొఱియఁగా నొకఁడు త్రిప్పెడుఁత్రిప్పడొఱపుగాలి నొ
నొకచేతఁ బులి నొంట నొకచేతలేడిగా నొకఁడెత్తు నెత్తికో లాఱపునిలిపె
నొకచేత నలు గొంట నొకదుప్పికోదమగా నొక్కఁడూచిన యూఁపులుప్పతిల్లె
నొకచేతఁ బోతొంట నొకమన్నెఁబెంటిగా నొక్కఁడార్చినయాట లొప్పిచె దల్లె
నొకఁడు నొకటఁ దగక తొకటికిఁదెగకొక్క, డోపి రిట్లు రెఁటి కొకఁడెచాలి

పలుఁగుల పొక్కాల వలకేలు డాకేలు, బిరుదు గిరుదుఁ బంచిపెట్టుకొనఁగ. 93

గీ. వీరు లిట్లు మెఱయ వేటలోఁ దనయుక్తి, కొంకి గుండువీడి గుంపుఁగూయ
గుండునడ్డ దీము కోలములోఁగూడనం, చొక్క బక్కయెఱుప చక్కనగిరి. 94

గీ. వారికిచ్చె నల్లవాని విభుఁడీగు, లిచ్చె జూడు పుణ్యమెట్టులుండె
నడిచియడిచి దంచినమ్మను నూరక, యున్న యప్పుకొదవె నొక్కఫలము. 95

వ. ఇదియు నొక్కొక్క దిక్కునం జక్కటి యనిపించు నదియట్లుండె. 96

క. చూచియు నిచ్చియుఁ దనియని, రాచూలికి వేఁటలాడరాఁ బ్రొద్దదీ
యీచక్కటి నన నత్తతి, వాచాగోచరముగాని వగ సంధిల్లెన్. 97

సీ. చౌరబద్ద ముంగిస యురిసడ్డగరిమిడి మునుపుగాఁ గొల్లున ముగిసిపోవ
జోడించిన సినంగి కేడించుకొను నిట్టి వెనుకగాఁ గుట్టూర్పు విడిచి త్రెళ్లఁ
జూపివేసిన డేగ చోపి లేపినపుల్లు మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగఁ
గఱనఁ ద్రొక్కిన కుక్క వెఱవ కెక్కిన పంది క్రిందుగా బాణముల్ చిందికూల
మృగగళగ్రాహికరముల బిగువు వదల, గల వలలు మీటువారు మూర్ఛలమునుంగ
మిట్టి వినువీథిఁ దిరుపులు గట్టికట్టి, రణహరులు రాఁగ నొకమహానినద మెగసె. 98

క. ఏమనఁగవచ్చుఁ దద్ధ్వని, చేమిగిలిన వేఁట ముగిసెఁ జేడ్పడిరితరుల్
దీమసము వీరశబర, గ్రామణి యొకఁ డొంది యప్పురంజయుతోడన్. 99

క. గబ్బిమెకములని మున్నే, నబ్బురపడి చెప్పినట్టి యానాల్గిటిలో
బొబ్బమెకము రావ సుమ్మది, జబ్బావినుమనఁగ నాకసము దెస నంతన్ 100

క. తిర్యఘ్న మృగఘ్న నద, ఘ్నార్యఘ్ను లనంగ నలువు రసురలు వీరో
హర్యంశ జనిత వింటే, హర్యక్ష వ్యాఘ్ర ఋక్ష హరిరిపు రూపుల్. 101

గీ. అనియు వీరసాధ్య లబ్జభూవరశక్తి, ననియు సింహరూపు నట్టహాస
మతఁడు వలసినప్పుడందుఁ దిర్యగ్జాతి, ననియు వేగవారిఁ దునుము మనియు. 102

క. వినఁబడిన మేలు కాకని, ధనువుం దూణీరయుగము దాల్చి కటుజ్యా
నినదమున దెసలు వసమరఁ, గనుగడ లెల్లెడలఁ ద్రొక్కఁగా నునుఁగెంపుల్. 103

క. ఘోరాజికౌతుకంబునఁ, ధారాకౌశలము మెఱయఁ దనతేజీనా
శేరాచరౌతు వీరర, సారూఢనచతురుఁ డచట నాడింపంగన్. 104

సీ. సింగంబు పఱతెంచి ముంగోళ్లఁ దెమల్చి నమలి కార్వేతుల నుమిసికొనుచుఁ
గాసరం బరుదెంచెఁ గేసరిపరికరంబు శితశృంగకోటులఁ జెలఁగికొనుచుఁ
బులితాఁకుదెంచె నెల్గులపొట్టలవియఁగాఁ దిగిచిమారొక్కని పోరఁద్రిప్పికొనుచు

బుభుక్షమే తెంచెఁ దరక్షువ్రజకళేబరములు రూపఱఁ ద్రొక్కి చమరికొనచుఁ
బఱితమృగసంఘ సంకీర్ణపథమువట్టి, విక్రమోన్మత్త చేష్టితోపక్రమంబు
దప్పితమలోనఁదమకుఁ దత్తరపుటలుక, తోనపుట్టినఁబుట్టుఁబో వీనికనఁగ. 105

చ. అంతట మూర్ఛదేఱి పులియా యెలుఁగా యెనుపోతు సింగమా
కాంతుమ వీనిగర్వ మని క్రక్కునఁ బైఁబడఁ బాఱు వేఁటకా
అంతకుఁబ్రోలికిం బఱచు నంతకుఁ జూడక దివ్యబాణవి
శ్రాంతి నడంచెఁ దన్మృగవిహార ధురత్వము రాకుమారుఁడున్. 106

ఉ. రక్కసులుం భయంపడక రాసుతుపై నొకఁడింద్రదంతినై
యొక్కఁడు మేఘమై యొకఁ డయోమయపర్వతమై యొకండుదాఁ
డెక్కలి మిత్తియై యరుగుదేఱఁగఁ జూచి యతండు వీరియా
చిక్కులు సాగనీగి బలుసేగి బలంబున కంచుఁగ్రక్కన్. 107

పంచచామరము. సమంత్రకంబుగాఁగ నైంద్ర సాయకప్రయోగము
క్కుమార శౌర్య శాలి సేయఁ గోటి కోటి బాణము
ల్క్రమక్రమోదితంబులై వికారి దైత్యమాయలన్
గమర్చి తచ్ఛిరంబు లూడ్చెఁ గండశైల భాగముల్. 108

క. కొండలు వోలె సురారుల, మొండెములు గూలె రాలె ముమ్మరముగ నా
ఖండలతరుప్రసూనము, లొండొండ విరించినంపనోక్తులు సెలఁగన్. 109

వ. అంత. 110

శా. వీరం డవ్విలుకానిఁ గాంచి యొడయా వేఱొక్కఁ డున్నాఁడె ని
న్నేరూపంబున నైనఁ బోలు దొర నీవే రాజవు త్రాతవు
న్వీరిం గాచితి విమ్ములన్నసుచురా విన్నంది పోరాడఁగా
వారిం బాచితి వింక నొక్కవర మే వాక్రిత్తు మాకిత్తువా. 111

క. ఈకానవచ్చు గీములు, నాకూరిమిగూడె మచట నాలుగుగడియల్
నీకొండంద్రను మనుమల, నీకన్నులఁ జక్కఁ జూడ నిలుచుట తగదే. 112

క. ఇదివరమని పావలతోఁ, బదమాదలఁ బెట్టికొనిన వానికభీష్ట
ప్రదుఁడుగఁ గదలి కకుత్స్థుఁడు, తదుపాంతవనాంతరమునఁ దగు మైనిలిచెన్. 113

క. పతితోడఁ బలికినంతను, నతఁడును నధికముగఁ బట్టె నటవీనస్థ
ప్రతతులులుపలుగసుతుల, న్నతుల న్మొక్కించె నతని చరణంబులకున్. 114

ఉ. రాకొమరుండు నందజుకు రత్నమయాభరణాదులిచ్చి యా

గోకొలఁదిం బ్రియోచితములాడి తదీయసపుత్రమానినీ
లోకమునంచి యన్యులఁ జెలో యని వీళ్లకుఁ బంపి సూపకా
రాకలనోపపన్న మృగయాపల భోజ్యరసైక తృప్తుఁడై. 115

వ. గంధోదకంబులఁ గరప్రక్షాళనాదులనివర్తించి శతపద గమనంబునకై నడఁగూ
డునప్పుడు. 116

ఉ. క్రేవల వేఁటకాండ్రు దమకింపక డింపక వెక్కుబాకులం
బోవుచు మాంసభేదముల బోనము లాయితమైన దాఁక నా
యావిధు లాచరించి యవియన్నియు దేవరకెక్కునట్టి సం
భావనసేసి తారు మఱి బంతులుసాగి భుజించుచుండఁగన్. 117

గీ. చూచి చూచి నగుచు లేచినవారిఁగూ, ర్చుండ నానతిచ్చు చొయ్యనొయ్య
వెసలె బంతిబంతి వెంటఁ దాంబూలగం, ధములు విపిన సౌరభములగదుమ. 118

ఉ. ఎల్లరుఁ దృప్తులైన వెను కించుక సేపట విశ్రమించి రా
గిల్లినమూకతోడఁ దమకింపని యానముతోడఁ భిల్లరా
డ్వల్లభలక్ష్మితోడ వనవల్లభుతోడ జయంబుతోడ భూ
వల్లభనందనుండు హయవల్గనమొప్పఁగ వచ్చె వీటికిన్ 119

క. వచ్చిహజారంబునకు, న్వచ్చిహరులఁజూచురాజు నకునానతుఁడై
తెచ్చినవివిధసువస్తువు, లిచ్చిన యెఱుకు దొరతోడ నిడియెన్మ్రోలన్. 120

మ. సుకుమారుండును గన్నులం దనుపరాసుల్వంశజాతాది మౌ
క్తికముల్ గాంచెఁ గటాక్షముల్మృగమదాదిద్రవ్యసంపత్తిచా
యకు రానిచ్చె వినీతుఁడైతెనకు సాష్టాంగప్రణామంబు చే
సికరంబుల్మొగిడించునయ్యెఱుకుఁజూచెం జూపులాపోవఁగన్. 121

క. సకలవిపినాధిపత్యము, నకుఁ బట్టముఁ గట్టికొమ్మునాసభ వని వా
నికిఁ దనగారుత్మతనా, యకమణిహారంబ యిచ్చియంపెఁ బొసంగన్. 122

ఉ. ఆతరువాతఁజూడఁ బరియత్తెపుఁ జేతులు రిత్తిబండ్లు ద
ట్టీతలచుట్లుగాఁగ మగిడించిన పట్టెపపైఁడిత్రాళ్ళనై
యాతల వేఁటకాఱునికి యారసి రెండిది యేమియన్న న
య్యాతలఁచంగనాకు వెఱపై గరుపాఱెడుమేనువింటివే. 123

గీ. కానుకకుఁ దేఱఁ జనిచూడఁగాజవాది, పిల్లిలోన్నుగ మాపిఁటఁబెంచినవియుఁ
బెద్దనిద్దురఁ గనుమూసిపెట్టియుండె, వీరిజంతువు లీల్లుట వింతగాదు. 124

క. ఆరూపమె కరులసంతతి, మాయపువుల మొలువఁ బెట్టి మాకు స్వాపెం
బోయె నొకరూఁతనన్నియు, నాయాలము వేయుఁగన్నులతఁడగుఁ జూడన్. 125

గీ. అనిపులిందరాజన్మమహారాజుతోఁ, బలుకుచున్నయపుడ కలదుకలదు
కంటి కంటి నదియుఁ గన్నులుచల్లఁగా, ననుచు వచ్చె నిర్జరాధివరుఁడు. 126

సీ. వచ్చినమానవేశ్వరుఁడుఁ గుమారుండు దానసంభ్రమసముద్దానవినతు
లాచరించియు విమానావతీర్ణుండైన యాత్రిలోకీనాథుఁ డాదరంపుఁ
బరిరంభణంబులు వడిఁనీయ నతనికి నర్ఘ్యాసనంబిడి యర్ఘ్యపాద్య
ముఖ్యపూజలు తుదముట్టఁ జేసియు బృహస్పతిసర్వదిక్పతిప్రభృతులకును
దగినసత్కృతులు సలిపి తదనుమతుల, సముచితాసనములనుండి యమరరాజ
సేమమా మీకు మీరు వేంచేయు టెల్ల, మాతపంబులపంటయై మనుపఁగాదె. 127

వ. అనినకుమారుండు పలికెఁ బలికిన సునాసీరుండు. 128

గీ. మీతపంబులయును మాతపంబులయును, మేనిపంట యెల్ల మేనుదాల్చి
మనుజనాథ మిమ్ము మమ్ముఁ గృతార్థులఁ, జేయనీకకుత్స్థుఁ డాయెఁ గాదె. 129

శా. ఏ తేజం బిటఁ డయ్యెనీ వెఱుఁగవా యీమాట యిట్లుండెర
మ్మాతాత్పర్యముతోడ నీ వడిగెదమ్మా మామ మా సేమమే
నీతో నీయెఱుక ప్డు చెప్పెదది దానిం దేట గావింతు వి
న్మాతిర్యఙ్మృగఘ్ను లిద్దఱు నరఘ్నార్యఘ్ను లన్నిద్దఱున్. 130

సీ. ఉగ్రుఁడన్నసురమణిగ్రీవయా మదారతయునను గంధర్వతనయలందుఁ
గవలుగనల్లాఁగఁ గాంచిన కొడుకులు వారునల్వురు బ్రహ్మవరమహాను
భావగర్వితులు దీపధ్వజాదెచ్చెలు ల్మప్పంద్రలోపల మొదలివారు
దేవాసురావధ్యులే వేళకేరూపు వలసినఁ దాల్తురు వారిలోనఁ
బెద్ద తిర్యఘ్నుఁడే బొబ్బవెట్టవినిన, దేవతిర్యఙ్మనుష్యులు తీఱవలయు
ననఁగఁ బోయి తిర్యగ్జాతి యడఁగవలయుఁ, గోరినపుడనియజా వేఁడికొంతమనిచె.

క. వాకటు దిరుగుట విధిమా, యాకృత మపుడతఁడు తిర్యగాకారధరుఁ
డ్రాకాసులు వాహనములు, నాకూఁతెక్కుఁ జెడమి వేఁడినది పదిలముగన్. 132

గీ. వరుసఁ బెఱమువ్వురజతరవహ్నిశిఖలక్ష్మ్యగమనుజమానిసంఘము ల్దగియెఁ బెక్కు
వీరికిని నామములు రక్తవృష్టితోడఁ, బుట్టునెడ భూతముఖములఁ బుట్టినవియు.

మహాస్రగ్ధర—హరిఁగొల్వంబోయి యే మాయనఁ గనియతఁ డొండానతిఁగాఁ దదాజ్ఞా
పరతన్రాఁగా వృకైకప్రభువయి పులియై భల్లుకంబై మహాకా

సరసమై భాగీరథీపార్శ్వమున నటవి నచ్ఛండరాకాసు లున్న
దిరమై సింగంబు దా బొబ్బిడిన గడసె నందెల్ల తిర్యక్కులంబున్. 134

క. అచ్చటికి మనపురంజయు, వచ్చుటయుం గంటి మావరంబు వినియు నీ
నిచ్చలపు రౌతు తేజీ, నొచ్చుటలే దదికదావినోదపుఁ గతియున్. 135

గీ. వాహనంబునారోదఁ జెడనలవననుచు, నాఁడునిజబలరతుకై వాఁడు వేఁడెఁ
దమవి యని పేరుగుచ్చనిదాన సకల, వాహనములకు నైనమా వరమునిలిపె. 136

క. అననుజనధము సేమము, గాదే మిన్నంది చూడఁ గంటిమి తేజః
ప్రాదుర్భావము గలిగిన, యీదొరనాతూపు దొడిగి యొసిగలు చుటన్. 137

మ. అని జంభారి కకుత్స్థుఁ జూచి నుతిసేయంగా వినీతుండ నై
జననాథాగ్రణి మీకు సేమమునఁ గర్జం బౌనె మేమేల య
ప్పని ద్వీపధ్వజుఁ డెవ్వఁ డాప్తులుగ ముప్పఁ దెవ్వరిచోఁ గనుం
గొనఁగ న్గైస్తారినీశుఁ డేమనియు నాకుం బోలినం దెల్పవే. 138

తరల—అనిన వజ్రి నృపాలకా వినవయ్య దీపపతాకుని
న్వినిచెదం గలనామరాక్షస వీరమాళికి నగ్నిజి
త్తనయకుం దరశాభిధానకుఁ డాఁగుమారుఁడు వాఁడు త
జ్జననిజ్జనంబు నప్పుడె చక్క నెక్కవిమానమున్ 139

క. అనవుడు రాజాను దేవా, తనకదియొక వ్రతమొ వంశధర్మమొ యొక్కం
బనియేమి విమానంబది, తనయునిఁ గని యనిన దేవతాపతి వరుసన్ 140

చ. వినుమది నాకలోకమున వేడుకకత్తియ దానిదానవీ
జననదానమొక్కముని శాపముఁ జెంది సుతోదయంబునం
జనునది యయ్యపుట్టిన దెసంబొసఁగం దరశాఖ్యదానికి
న్మనమిన మంచుతోఁ దొలఁకు మించునఁ చంచలయట్లు తోఁచుటన్. 141

గీ. దానినను పుకాఁడొక్క గంధర్వుఁ డెల్లఁ, జెలిసి సుతుఁగాంచుతతివేచి తేజఁజూవ్వ
వెసవిమానంబు నెక్కి రక్కసులతోడి, తొడుసుడిగ నంచునది లొంటియొనలితోడ.

ఉ. అపగిది న్విమానవతియై యది వేడుకగానిలోఁ జనం
దాపముఁ గోపముం గదుర దాని నభోగమనానుధావియై
యాపాలమెల్లఁ ద్రిప్పి ఘనుఁడై యమరావతి కంటివచ్చి తా
నే పవిధారి బారిఁబడియెం బగవట్టెను దత్తనూజుఁడున్. 143

ఉ. ప్రేమున దారి సోమఁగని పేరిడియగ్ని జితాహ్వయుండు నా

తానుహుఁడెత్తి పెంచి కలదానవుపాళిఁ బెంపఁ జూన్వె వాఁ
డే మొనరించు విఘ్నవిధు లెక్కడఁ బ్రొక్కెనో యద్రికన్యకా
కాముకుఁ గొల్చినాఁడు చిరకాలతపంబున నాజపంబునన్ 144

గీ. వజ్ర మెదు రెక్కడుండంగ వరము వడసె, వచ్చు యమదండమున కుండ వరము వడసె
వరుణపాశాదు లుడివోన వరము వడసె..... 145

క. ఈవిధమునఁ దన కెమరన్, దేవాసురవరులు వివశనిజసాధనులై
పోవందీపధ్వజుఁడై, దా వెలుఁగం భర్గవరకదంబము వడసెన్ 146

సీ. అగ్నిజి త్తమరింప యమజిత్కుబేరజిద్వరుణజిద్వాయుజి ద్వసుజితాత్మ
లనుతిశిర త్రిశూల త్రిజిహ్వ త్రిబాహ త్రికంఠ త్రికర్ణాహ్వయులును
గిరిరథో త్కరథ మేఘరథ సింహరథ మహారథ విరథ రథాభిధాను
లనుగల్య కఠినవాలకరాల కర్కశ కామాంధ కలి కాకనామధరుల
నతఁడు సఖులఁ జేసె హాతచతుష్టయముతోఁ, ద్రింశదాప్తసంఖ్య దేవవినుము
వారి మహిమ లెల్ల ఘోరాహవంబున, గురుఁడు నీకుమారకునకుఁ దెలియు. 147

క. కలరయ్య ఘోసరోమా, దులునల్వురు జోదులఖిల దూష్యవ్యాపా
రులు వారిచతుర్విధబల, ములు ప్రబలము లతఁడు బన్నములు పఱపంగన్. 148

ఉ. పోయి పయోధిశాయి పరిపూర్ణతరంగభవానిలానుసం
ధాయి నపూర్వచేష్టితవిధాయి సమస్త తపస్విమానస
స్థాయి రమానపాయినకదా కని యక్కడ చెప్పినార మ
మ్మాయి ననుంగకుత్స్థుఁడనుమా మఖవాయనియెన్నృపాలకా. 149

క. అనుటయు నిట్లను టేమను, టని యే నడుగంగ దేవుఁడస్మత్తేజం
బునిచితి వికుక్షిగర్భం, బున నది యతఁడయ్యె నతఁడపోయెననియెన్. 150

వ. అని యింద్రుండు పలికిన నమ్మహీవిభుండు. 151

క. తనతనయుఁ బిలుచువాఁడ, య్యానజని మోహమున నాఁతఁడీశ్వర తేజో
జనితుఁడని మఱచి యీపా, పని నేనెట్టనుతు నసురపైఁ బడహరితోఁ. 152

ఉ. ముందఱ వేఁట కంపి కడు మోసము చేసితి నిప్పుడేనుజా
తుందనుజాతుఁ డంచు మది దుంచుడు కొందఁగ నాకసంబునం
బందిరి వెట్టినట్లు తెలపాయము నంబలవజ్జయంబు సూ
పం దెగి నేర్చి పుణ్యపరిపాకమున న్నను జేరియుండఁగన్. 153

క. మగుడంగ నిందుఁబొమ్మనఁ, దగునే యీయసుర యేకతముఁడే బహుదై
త్యగణావృతుఁడఁటె యందో, డగుటకునెవ్వఁడొకొ యింద్రుఁడనిదిగులొందన్.

ఉ. ఆయన యీయనాలపను నాననదీనత గాంచి యయ్యభి
ప్రాయమెఱింగి లెస్స చెవిఁబెట్టెఁగదా కత దానికేమి ము
న్నే యది యేయెడం గలిగెనే నునుబొజ్జకు నీవెఱుంగ వే
యీయనవద్యతేజ మితఁడౌటకు సందియమంది యోడెదే. 155

ఉ. ఒండొకఁడైనఁ బ్రాక్పరిచితోగ్రబలాభ్రసరస్సరద్విష
ద్భంజన పండితున్నినుఁ గదల్పక వీఱిఁడిఁగాఁ జుమయ్య యి
క్కొండికఁ బిల్వ నప్పగఱఁ గూల్పఁగ నీతఁడ కాని చాలఁడ
న్యుండని యొప్పఁజెప్పి తదనుజ్ఞను దెచ్చి కకుత్స్థుఁ జూపినన్. 156

క. అతఁ డితఁడు వృషభమగునే, ధృతికని శిఖిముఖులఁ జూచె దిక్పతులు బృహ
స్పతిఁ జూచిరి గురుఁడు శత, క్రతుఁ జూచె బలారితత్పరత్వము చూచెన్. 157

వ. చూచుంగాకేమి. 158

సీ. మకుటంబు మాయమై చికిలికొమ్ములు పుట్టెఁ బెనుదోరమై పెద్దపెఱిఁగె మొగము
రెండుండి పెఱకన్నులుండక పోడలుబ్బె సోఁగలైయడ్డంబు సాగె చెవులు
కంఠహారము డాఁగి గంగడోలుదయించె వెడలు పునిదుపునై మెడపొసంగె
మును పున్న పవితేక వెనుక వాలము దోఁచెఁ గేలుగాలుననలుగాలు నిలిచెఁ
గరపదాబ్జంబు లిరువాయిగొరిజలయ్యె, నంసశిఖరములుమ్మూఁపురంబై తనర్చె
నడువఁ దడవని కానికొల్వ్వేడుగ నుటికి, వెస బసవరాయఁడై అంకెవేసె వజ్రి.

ఉ. గ్రక్కున లేచి యమ్మహిమఁ గన్గొను రాజునకున్నిజాంఘ్రికి
న్మ్రొక్కి పురంజయుండు తనమూఁపుర మెక్కిన దివ్యదీధితుల్
గ్రక్కునఁ దోఁచి యందియలు గంటయు మువ్వల పేరుమ్రోయనా
వెక్కసి గిబ్బయభ్రగతి వేల్పులతోఁ జనియెం బ్రతీచికిన్. 160

చ. వెలలిహజారమాన్నృపతి వేల్పులు దవ్వగు దాఁకఁ జూచి మూ
ర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి నాప్రభుత్వపుం
బలుకుల బిడ్డ నెక్కడని పంచితి వాసవుఁడేమి పన్నె నం
కిలి వడకున్నె యంశుమతికిం దను వేగతిఁ జక్కఁ జెప్పినన్. 161

సీ. అని యలందరుచున్నఁ గని వీరశబరుఁడో యయ్య నీకొడుకెంతకైనఁ జాలు
నగవనుమా కానఁ దెగినరాకాసుల కంటె గొప్పాటె వారుకలని శతఁడు

వాసిమానిసి గెల్చివచ్చు మీకతమున మింటిరాజులఁ జూడఁ గంటి ననిన
నగి పోయెదే యన్న నాసామి యేనిఁకఁ బోయెద ననిపోయె బోయఁడును
దేవి కెఱిఁగింప బిడ్డఁడా కావరంపు, రొదలయాఁబోతు పైమింటఁ గదలువాఁడు
వచ్చునా యని యిలువ్రాలఁగుచ్చియెత్తి, తేర్చసతిఁ బతిదైవంబు దేల్చుచుండ. 162

—* లయగ్రాహి. *—

ఆయెడ వసిష్ఠమునినాయకుఁడు వచ్చి జననాయకుఁడు దేవియువిధేయములు పెక్కు-
ల్సేయ వినయాదికములాయిరవుగం బిలిచి మీయునికిచింతకొడలై యునికిదోఁచెన్
బోయనిఁ జాఖ్యలకునీయనుఁగుఁబట్టినృపుఁడాయపుడటీక యిడుఁజూయనసెయింద్రుం
డాయెగదవాహనమయాయనఁగకుత్స్థుఁడునునాయనపురంజయుఁడునైయిపుడువచ్చున్.

గీ. పురము లాసురంబు లెరియించును జయించు, నింతకేల మనసుచింత గొనఁగ
ననియతండు సనియె నయ్యింద్రవాహనుం, డభ్రగతిన పశ్చిమాబ్ధిఁ గదిసె. 164

వ. అప్పుడయ్యిందిరాగురు నింద్రగురుండు పురంజయునకుం జూపి. 165

సీ. దీపించుచున్నాఁడు భావానుమోదజప్రాబల్యశబ్దప్రపంచమునన
చల్లించుచున్నాఁడు సకలవీచికల నీయుదధి సీకరలాజలెదుటికెగయఁ
జళిపించుచున్నాఁడు ధళధళన్మీనాసు లేచ్చఱపంగఁ దోడేయుటకును
బన్నించుచున్నాఁడు బలిమిబారులుగాగ జలమానుషకరేణు సంఘములను
జయమునీకెల్లభంగుల సంఘటింప, మొదలినెయ్యంబు దలఁచి సముద్రరాజు
చూడు మనవుడు తనతాల్చు సూడిగంబు, కానుకఁగ వైచి తాచూలికరము మొగిచె.

ఉ. వైచినసూడిగంబు మురిపంబునఁ దాలిచి దివ్యమూర్తియై
లేచి పయోధిపై కొకఁడు లేమలతోఁ జనుదెంచి వేళయు
న్వేచి సబాణతూణములు విల్లులు జోడు నొసంగి పోయినం
జూచి కకుత్స్థుఁడేమియిది చోద్యమన న్విని దేవమంత్రియున్. 167

చ. అతఁడు సముద్రుఁ డీవిడిన యాభరణంబె ధరించి వచ్చినాఁ
డతివ లగణ్యపుణ్య నదు లమ్మెయిరాక త్రిలోకబాధక
ప్రతతివధించి యిండ్లు నిలుపంపగు నెల్లరకంచుఁ దెల్ప జో
డితరదురాపమీవిలులు నేయఁగనిండియయుండుఁ దూణమున్. 168

క. ఇవరుణుఁ డౌర వరంబులు, సవరణయిదిపలఁచి యొక్కొ-చను దెంచితివీ
వవులం దేకని బలనిగ్, యవునిప్పు నెమ్మెచ్చి వరుణుఁ డెయ్యోసకుసరున్. 169

చ. అని గురుఁ డుగ్గడింపఁ గలయం జలమానుషకన్యలిష్ట కుం
డెనలును బోని సుళ్ళ నవనీరగణంబులు ప్రాంతమీనన
తఁన చలితంబులై తొరఁగఁ బ్రాలసరిం బెఱసొంపులేర్పడం
దనపరివారదేవతలు దాను బయోధినతండు సూచుచున్. 170

క. తదుపరితీరాగ్రనభః, పవవికిఁ జని నిలిచి పొలిచెఁ బ్లక్షద్వీపా
భ్యుదయంబు షణ్ముఖుం డై, యదిరాయన నగరషట్క మద్దరిమెఱయన్. 171

గీ. చూచి గిప్పునఁ జూచిన రాచబిడ్డ, తోడనతఁ డిట్టులనియెఁ దత్పురవరంబు
లేను వేర్వేఱ నగ్గించి యెఱుకపఱతు, ననుచు నద్భుతరస మొక్కవేనువుదాల్ప.

చ. గిరిరథమిప్పురంబు పరికించితె యల్లదె దుర్గ మద్రిపై
గిరిరథుఁ డిట్లు కట్టఁగలిగెం దనపేరన యూరు తేరుగా
వరమున వచ్చె నగ్గిరియె వానికి భర్గుఁ డనుగ్రహింప ను
త్కురథముఖోద్ధతావరజషట్కముతో నతఁ డుండు నచ్చటన్. 173

క. సాలము త్రిజగద్భీకర, కీలముగా వరముగల త్రికీలు పురము త
త్కీలత్రయి వెలుఁగునది త్రి, కీలమనుజులేవు రతనికిఁ ద్రిశూలాదుల్. 174

క. వసుజిత్పుర మది రవిశశి, వసుజిత్కురువిందవజ్రవప్రము యమజి
త్తైసఁగించెఁ గుబేరజిదా, ద్యసహోదరయుతుఁడు పిన్నతమ్ముని పేరన్. 175

గీ. కల్యదానవుండు కఠినాదులనుజులే, ద్వ్యురుభజింపనుండు పురము నివుల
నిదియ యదియ వీరసదుదగ్రనందన, పురము నేటితోఱఁగె దొరదొఱంగ. 176

ఉ. ఆపురపంచకంబు తనయంతలపొంతల యిండ్లపిండుసూ
గోపురసౌధము ల్పురలు కొల్వునకుం డిగివచ్చు నిచ్చెనల్
చూపఱ జోలియేల యిటు చూపఱ చూపుల నాచికొన్న యీ
దీపపతాకపట్టనముఁ దేఱికనుంగొను మెంత యొప్పునో. 177

క. వేలావంతుని వెంబడి, నేలం బారాదిమేర నిడుపై యునికిన్
వేలాపురమనఁబడునది, కైలాగొదవించుఁ దరగగాడ్పులకెపుడున్. 178

సుగంధి—దాని చెంతనందన ప్రథాపిథాన దక్షనా
నానానవద్యరత్నహర్మ్యమాలికా మయో
ద్యాన మొప్పఁ జూడు మన్న నాసుగంధి కేలికా
కాననంబుఁ జేరి డిగ్గె గబ్బిగిబ్బనాతఁడున్. 179

క. తోడనవచ్చిన శిఖియమ, రాడాదులతన్వనేక రక్షకరక్ష
శ్చ్ఛాడాకతఁనఘాతఁ, క్రీడా పరితృప్తులైరి గిరి యానములన్. 180

శా. ఆలో నిర్జరరాజమంత్రి వసురుద్రాదిత్యసంఘంబులన్
వేలంబుల్విడియించి యుత్కలముగా నిల్వంగ నందుండు య
త్తాలిం బొమ్మని దాడి యాడియెలగోలందింప విద్యాధరు
ల్సాలం జేసి విమానము ల్దిగి దిగీశశ్రేణితో నేర్పునన్. 181

వ. పురంజయుం జేరి యొక్కమహనీయసౌధంబున నుండిరనిన విని జనమేజయుం డ
వ్వలివృత్తాంతం బెట్టనిన. 182

మ. సరసప్రాభవభావ భావభవజిత్సౌందర్య దర్యంతరాం
తరయోగార్జిత జీవ జీవయసుహృద్రాజన్యజన్యాసదృ
గ్గరణీజాతపలాహృతద్విపఘటాకంఖాణసంవాసవా
సరరాజాద్భుతకృద్గగ్గగితభాసాచర్వితాశాంగనా. 183

క. భేరీభాంకారారవ, దూరీకృతవైరివీరతోయజనయనా
పారవిపాదపదవానల, వారణతరవారిధారవసుధాధారా! 184

మాలిని—వితరణసురభూజా వీరవిద్యాబిడౌజా
ధృతిగతి నగరాజా దిగ్తటవ్యాపి తేజా
మతిమహిమసమాజా మానినీహృన్మనోజా
జితవిమతసమాజా చిన్నమాంబా తనుజా. 185



ఇది శ్రీమత్తిరుమలతాడప్పాచార్యచరణసరసీరుహసేవాసమాలబ్ధసామ్రా
జ్యధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందలవరనం
దన మట్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబను
మహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు.

# కకుత్స్థవిజయము.

## పంచమాశ్వాసము.

———:O:———

క. శ్రీవేల్పల్గోచన దీ, నావనఘన సదయహృదయ యమితాభ్యుదయా
కావేరీవల్లభ యె, ల్లావనిపాలాఖ్య ధావదహితసమాఖ్యా! 1

వ. అవధరింపుము మనునంవన కథాసుధాధారాధౌత మానసా మేయజయుం డగు జన
మేజయునకు శంపాయనుం డగు వైశంపాయనుం డి ట్లనియె. 2

సీ. పవనంబు మోసెత్తి లవణాబ్ధి కమృతాబ్ధి తరగమీఁదనవచ్చు తరగవోలె
జలబలం బతిమెఱుంగులభార మెచ్చిన ధరకు వ్రేలెడు శరద్ఘనము వోలె
దనుజోపవనికిఁ గ్రందలిరు జొంపము దాల్చి పెకలి యేతెంచు కల్పకము వోలెఁ
దనుఁజేర రిపుతేజమును మోచికొని యుట్టిపడుచున్న తద్యశోభరము వోలె
వదలు జడముడితోడ నారదుఁడు వింటి, రాక దవ్వులఁ గని కుమారమణి యితఁడు
దొరగిపోయిన యొకిరింతఁ దొడఁగి వెతకు, మదనహరుఁడే మొమనగిబ్బ రొవకు డిగిరొ.

క. అని తెలుపఁ దెలిసి దిక్పతు, లును దానెదుర్కొనఁగ నిలుచునంతనె య
మ్ముని డిగి తా నిడు నుచితా, సనపూజలు గొని మనోలసతఁ బలుకలయన్. 4

మ. ఇటఁ గూర్చుండుఁడనంగఁ బర్వతుఁ డదియేచ్చాచు సాదైకలం
పటు నీక్షించి సుఖాసనాదులను సంభావించి రాచూలిచెం
గట దిక్పాలురత్రోవఁ జొచ్చి మునిలోకస్వామి తేమయ్య మీ
రిటఁ జిన్నందన మొందినా రనుడు వాగీశాత్మజుం డిట్లనున్.

క. అచ్చరలాడఁగఁ గిన్నరు, లెచ్చుగఁ బాడంగఁ గనుచు నింపుగ వినుచున్
మెచ్చంగ దీపకేతున, కిచ్చక మో యనుచుఁ బోయి యెఱుఁగక యేనున్. 6

క. ఈ తెలొకోటలా మతిపని, పాటలా మీకింత యాటపాటా పోట్లా
యేటలు బాటలు బాటిలు, పాటికి వారెపుడు వచ్చిపడుదురొ మీఁదన్. 7

వ. అని యింద్రవాహనుండవై నీవిట యెత్తివత్తని పల్కిన నతండు. 8

క. వారంటివి వీరంటివి, పోరంటివి మీఁదఁ బడక పోరంటివిగా
వారెవ్వరోయి పాఱుఁడ, వారనఁగాఁ దెలియ దేటివారో యనినన్. 9

గీ. ఎఱుఁగకితఁడు వెఱ్ఱి నిట్టివారన నేర, కనియెఁ దెలియఁ జూడుఁ డనుచు నొకఁడు
దిగివి చించెఁ గృష్ణమృగచర్మమప్పుడుప, ర్వతునిచేత నుండి బ్రతికె మహతి. 10

క. తదనంతికిఁ బర్వతుఁడుం, బెదరఁగఁ బులినాఁకివిడిచెఁ బెక్కుల యిఁకం
బద చాలు ననుచు నేమును, నదవదపడిరాఁ ద్రికర్ణుఁడా దొరతోడన్. 11

చ. అనుచిత మిట్లు సేయుదురె యమ్మునినాథుఁ డసత్యమాడె నే
దనుజకులం బడంపఁగఁ గదా సుకుమారకుమారుఁ డింద్రవా
హనుఁ డన నమ్మహామహ మహస్కరమండలమధ్యవర్తి పు
ట్టైననె యింతవికటించినఁ గార్యమె మీమదాంధతన్. 12

మాలిని—పోరితము ల్మతిపుట్టవె యేరికిఁ బుట్టిన నేమియవ్వంగములై
పోరరొ క్రమ్మఱఁ బొందులు సేయరొ ప్రోడలు సుస్థితిపొంటె సునా
సీరుఁడు మానిని జేటుఁగఁ జేసినచేష్టకుఁ జేష్వడఁ జేసియు మీ
వైరము మానఁడు వచ్చిరి సంధికి వారు కడంగఁగఁ వారెసురల్. 13

చ. హానుఁగుపడంగఁ జేసి పగవుచ్చు నుపాయము లేదె వారితో
మను మెటులైనఁ బెద్దమనమా యిఁక నెట్లొకొ యుగ్రదైత్యనం
దను లసహాయశూరులు వనమ్మునఁ గ్రమ్మఱఁ గూల్చి వచ్చె నేఁ
డనిమిషరాజు నెక్కి మనుజాధిపసూనుఁడు వారు దేఁఱఁగన్. 14

త్వరితపదగతివృత్తము—అననదరిపడుచునతఁ డనె నొకఁడు తిర్య
ఘ్నుని దదనుజుల నొడిచికొనఁగలఁడొ నన్నున్
జెనకి చనఁగలఁడొయన సిగలుఁబెగి దైత్యుల్
గనుఁనెదురఁ ద్వరితపదగతినరుగుదేఁజన్ 15

వ. దీపధ్వజుండువారి నాలోకించి. 16

చ. తల లివియేమి మీపరుగు తత్తరమేమి యనంగ నంతకా
దులు వృషభాధిరూఢనరుతో మనతోఁటకు వచ్చిమమ్ము ని
ట్లలజడిఁ బెట్టిరన్న నతఁడవ్వని నేమటె నిద్రవోవఁగా
నెలుకలు గొట్టెనేమొ సిగలెక్కడిసుద్దు లిసీచనుండనన్. 17

వ. యమాదులుం దిరుగం బుట్టిరే. పుట్టిన నిట్టిపనులు దలపెట్టిరే. యంబష్టకులచేష్టల
కుం జొచ్చితిపో యని యపహసించి. 18

క. యమజిత్ప్రముఖులువీనులు, చిమచిమమన మనమమాని చెప్పిన నయమా
ర్గము లోకడదియునిజమే, కమియఁగ లగ్గలను జొనుపఁగాఁ గలిగెనొకో 19

క. వచ్చిన నిలమోసినఫణి, మెచవిఱుగఁదె నగినఁ బడవె మీఁదిజగంబుల్
తొడతొడలుగమాయలుకకు, వడివడివారెదిరి మంద్రౌ వజ్రవిరోధీ. 20

వ. అనిపలుకుచుం బదరుచుండ విరథుండు. 21

తరల—పెరిఁగి దేహము వృద్ధి మిన్నను పేరులేదనిపించు నే
సరిగసందియసందిదండలు చక్రవాళముమానసో
త్తరముగా ధరియించు నీధరఁ దావకప్రభుశక్తికిన్
బిరుదుపెల్లిగమేరు దండము నిల్పనెత్తివహించునే. 22

క. పోరవఁగునెప్పుడన ని, వ్వీరాలాపములదాఁక వినివచ్చిని నిం
ద్రారులిఁగ నెత్తినత్తురు, మీరాయతపడుఁడు సమిపమే యోద్ధలకిన్. 23

వ. అనినవిని పురంజయుండు మాజతనంబు నిమిత్తమాత్రంబు దేవద్వేషులు మీకుఁ జేసి
న యపచారంబునన తెగుదు రనునవసరంబున. 24

—బంధురవృత్తము.—

పటపటఁ బగులుచుఁ దనతనతలనే పడ్డది మిన్నని భూమిజనుల్
పెటపెటఁ బెటపెట లాడవఁగఁ బెలుచంబేలఁగ రాలఁగఁ దారకలు
చ్చటభట కటురట దిషుశిఖిశిఖలుం బంధురదుందుభినాదములున్
గటకట పురిదెసఁ బెరుఁగఁగ విఱుగం గగ్గులకాడుగ వేల్పుమొనల్. 25

క. జనమేజయతోలువేల్పుల, కొనముఁకలు సురలనంటికొని పెడతలలం
జొనిపెఁ బెనుదూపులువ్వె, త్తునవిరాతలలకెల్లఁదోఁకలటంచున్. 26

చ. కనలు కకుత్స్థుఁ డప్డు కడకంటికిఁ దెచ్చుచు జోడుదాల్చి వీఁ
పునబిగియించి విల్లొనలు భూరిశరాసనమెక్కుపెట్టి వా
హనము కకుత్స్థదేశమున కానతుఁడై మఱిదాఁటెదాఁటెఁ బో
ముని యనలాదులం బనిచె మున్నగురుం డని సేయ ధీరుఁడై. 27

క. అయొదక్వర దిక్పతులకు, నాయెడ శిఖిజిత్తు యమజిదాదులతోఁడన్
బాయవడి యెదిరి మొగ్గర, మాయితపఱచికొని కొందఱవ్వల రాఁగన్. 28

సీ. అనలుండు ననలాత్ముఁడును దీపకేతుమాతామహుఁ దాఁకి రతండుదహను
వారుణాస్త్రంబున నీరార్చి యీశానుకను బెప్పనెసలిది చినుఁగ నేసి
వీస్వడ్డమంటకు వివిధబాణార్చుల పోరాటపుట్టించెఁ బోరఁ జముఁడు
తనదాయవరికిని దఱుమఁ దన్మహిషమ్ముబలియు రథ్యంబులఁ జెలఁగి కొట్టె
విరథుఁ డగుచు మఱియు నరదంబు నతఁడెక్కఁ, దత్తదశ్వములను మొత్తెఁ బోతు
ధనదపవనవరుణత్తదై వ్యరులకుఁ గచా, కడికతోరకలహింగతులు గలిగె. 29

క. సమరము వసుజిత్తునకును, యమవగుణుల నడిమిదొరకు నయ్యెమహీయ
స్తిమిరారుణజలదమరు, త్ప్రముఖావిర్భావపరుష భావమున నృపా. 30

గీ. అనుడు నభిమన్యుపౌత్రుఁ డా మునివరేణ్య, దహనజిద్వారుణాస్త్రంబు తడుపఁ దడిసి
శిఖియు జముపోతు తేరి తేజీలఁ దినఁగ, యమజిదసురుండు నేమేమి నైరిచెపుమ.

చ. అనమునిపల్కు నట్లసురయమ్మన నించుకనాని వహ్నియుం
దనతపనాస్త్రముం బరపి తజ్జలధారలఁ గ్రొచ్చి వానివి
ల్లునియఁగ వానిరథ్యములు గ్రుంగఁగ వానిరథంబు గూలనే
సిన విలుఁ దేఱుఁ దెచ్చికొని చెండి యతండెగిచె న్నిశాగ్నులన్. 32

మ. యమజిద్వాహనుఁడుం బరేతపతి వాహద్వేషిచే నుగ్ధితా
శముగాఁ దేరిదెస న్మనంబవుర మెచ్చంబట్టె నీకంటె మే
ల్జముఁడా నీయెనుపోతటంచుఁ గదఁ బెల్చన్మోదినందిమ్ముదీ
ఱమిఁ గొమ్ముంగవఁ ద్రిప్పకొంచునది వాఱంగాలుఁ దద్దాంబుగన్. 33

చ. తఱిమి రథంబు దున్నతల దప్పిడివారినఘోరదోరసిం
దఱుఁగకపోదు నేతల పదంపడి యిందఱు గాలురున్కియుక్
మఱపుగ నిల్చుటొక్కఁడన మంచిది చాలమి దెచ్చికొన్ననా
కఱగొఱఁ దీతుఁగాక యొకకాలుఁడకా తల ద్రుంపకేగదే. 34

వ. అనినజమునిపలుకులకులికిపడి రాక్షసుండు మాయామహిషంబునెక్కిపోయినప్పుడు.

మ. ఇరువాగుంగని యేమి బాసటగరాఁ డెవ్వాఁడు నందెవ్వఁడె
వ్వరిఁ గాలుండనివచ్చు వారితెఱఁ గుల్వాయం పురజ్జాదిగా
సరికిం మాయవనిం బరస్పరగదాసంపాతలత్యుత్వమొ
ప్పిరి వారాసురసాధనం బెసలెమా పెం దైవముం దానవున్. 36

క. దివిజులు తొలుతాఁకునఁ ద, మ్మెవిచిన దనుజులను మనుకులేశ్వరశరము
ల్వానయనిమంటలు మింటికి, నెవయంబడి కెడప మొనసి నిలిచిరితారున్. 37

మ. అటులయ్యందఱు సింధుమందరవియోగాభావముం జూపె ని
చ్చోటు నాఁగాఁ బెనుమూఁకలై విశిఖవీచుల్వర్వఁగా మ్రోసి యొ
క్కొట దీపధ్వజతాతఁ జుట్టికొన జూడ్కుల్మండ నొక్కొండ పి
న్నగనవ్వంబరముం బగుల్ప నతఁడంత శ్చార దుర్వారుఁడై. 38

క. తనుఁదాఁకు తూపుమూఁకం, దనవి యొకటిరెండుమూఁడు నాల్గైదాఱేఁ
డెనిమిది తొమ్మిది పది దాఁ, కనిమేషములేక యుండఁ గాంచము లేయున్. 39

వ. అయ్యవసరంబున. 40

— వడిసీసము. —

తాఁజాలగలవాఁడ తనధృతినిఱుపేద దరికినాలోఁ జేవ దఱిగిపోవఁ
తానేబలిమికాఁడు తనకైదువంపేదఁ దప్పదు నానాయుధంబు వృథగ
దాశరన్మేఘంబు దనతనజడివాన తఱుచునామిన్నేటి ధారలోలుకఁ
దానతమాలంబు దనవిరుల్మోసుగల్దవిలెనా క్రొగ్గంట్లు వళుకులొత్త
ధనదపవన గంగాధరతపనసుతులు, దనుజయోధులు బలముతోఁ దఱుమఁబఱచి
రనలవరుణులు తమతోడి యసురఁగూడి, యవులరేఁగులు తంగేడులనుచుఁ బాఱి.

వ. వస్త్వాదిగణంబులు చెల్లాచెదరయ్యె నయ్యెడ. 42

ఉ. వైచినఱంకెలం దెసలు వ్రయ్యఁగ నుబ్బినగిబ్బఁదోలుచుం
ద్రోచి నిశాచరేశ్వరులఁ దూఁటులువోవఁ గకుత్స్థుఁ డేసెఁ బోఁ
బూచెఁ గదయ్యమోదుగులు పూయకపోవునె రాజభాస్కరుం
డేచి జగంబువారి తపమింకిట మీఁద ఫలింపఁ జేయునాన్. 43

వ. ఆత్తెఱంగునకు సైరింపక కొందఱసురవీరులు తమలోన. 44

ఈ. నాకులభీకదానవగణంబులతో సరిపోలువారె వీఁ
డేకులవాఁడివెట్టెఁ దనయొద్దను దాను నిటుండి వీనిము
న్నేకతమంత మజ్జమునియింటికి నంచుఁ గకుత్స్థుఁడాఁకిరా
లోకము లగ్గిసల్ప నెటులో యటనెవ్వరొ యంటివేనియున్. 45

వ. వివరింతు నాకర్ణింపుము. 46

చ. కఠినకరాలకర్కశుఁడు కల్యుఁడు నంతకజిత్తునాదిక
ర్మఠులయిదావతీర్ణులయి ప్రాసగదాహలశక్తిశూల భృ
త్కఠినభుజాసమున్నమనగర్వము కర్ణకఠోరవీరవా
క్పటనము లుల్లసిల్లఁ దగఁబాఱిరి యబ్బిగిచూచి యాతఁడున్. 47

వ. కట్టెదుటికిం జేరవచ్చి. 48

సీ. ప్రాసంబుతోఁ గఠినాసురు బాహువు గదతోఁ గరాళుదుర్మదభుజంబు
హాలముతోఁ గర్కశపలలాసిబాహయు శక్తితోఁ గల్యునుద్రిక్తభుజయు
వేశూలఁదునిమినఁ గైకొన్నకైదువు ల్వ్రీడువని కుడిచేతు లెడమకేలఁ
బట్టిపైకడరు నట్టిట్టులు తలలేఱి యమజిత్తుమూర్ఛలోఁ జిమగనేయఁ
దేరుఁదవఁదెచ్చి తత్సూతుఁ డూరుసేర్చ, నక్కబంధంబు లెదురెక్కసెక్కడిన
వ్రేటునాటును నాయునువ్రేటు చూప, కపనిగలయాత పలితనం బివురపఁగ. 49

ఉ. ఆరభసంబునప్డు కఠినాదులచేఁ దలలేని బొందులం
జూరె కడంకలూరెనని చూపఱు మెచ్చుల మీఱఁబోయిరా
సూరెలమున్నె కన్నిడిన నూటిన వామభుజాభుజాదులం
బీరము సూపి త్రెళ్ళైనవి భీమమహోక్షు ఖురాహతంబులై. 50

క. తనకాతునేటులంబడి, యనిఁదెప్పిరు ఘూసరోము నట్టిదిమిశిరో
వనిఁ గటికి నెత్తురులుకం, దన నోరం బెలుకు వృషభదైవతరాజున్. 51

వ. నిరీక్షించి. 52

ఉ. నాలుగుడాఁచి వెట్టి పెఱనాలుకలన్వ్రేలుఁ గొందళూలభృ
త్ఫాలము కన్ను కైసువుగఁ బట్టైవనంవగుశూలమెత్తి య
క్కీలివిరోధిఁ ద్రేయుటకు గిబ్బచసంబరి మూతియూఁతగాఁ
గూలియు నట్టుపట్టిన కకుత్స్థుఁ గుదుర్వ్రాఁ జేసెఁ దేరుటన్. 53

వ. అప్పు డప్పురంజయుండు, 54

శా. ఔరా యక్కలినాదులంగలయరావై తేనియుం దానవ
స్థలిరావేడుక రేచితీవిటులు పెల్చన్వచ్చి యిక్కోలికుం
జవిరానీవిఁకఁ జెట్టగాక దివిషజ్జాలంబుతోఁ బోరుకెం
జివురానీదగు జాతికం చొకటనేసెన్వాని మూర్ఛంబడన్. 55

చ. పెలుకుటి ఘూసరోముఁడు కుబేరజిదాదులు నప్పు డాతఁడుం
డిలిగన కాపలంచి పరువెత్తిరి క్రమ్మటి సూతుఁ డగ్ని జి
త్పలలభుజు న్నిఖిధ్వజుని పాలికిఁ దెచ్చె బలంబులెల్ల దు
మ్ము లెగయఁ బాటి చొచ్చెఁ బురిమూయనివాకిలి మూసినట్లుగన్ 56

వ. అంత దినాంతం బైన. 57

చ. వలయపువంపుగొన్న విలుపాఁదుగ వీరరసంబుచేతవ
ర్థిలిన ప్రతాపవల్లి నలుదిక్కుల ప్రాఁకునె రాకుమారుచే
యలవునఁ గ్రుంకు కొండ నుదయాద్రి చివుళ్లొకరెండు సూపెనా
నలరె మురారి కన్నులు సురాలి కనత్రవిచంద్రు లిద్దఱున్ 58

చ. అమరులనిట్లు క్రమ్మఱచి యాటలుపాటలునై వియచ్చర
ప్రమదలు గొల్చిరాఁగఁ దమపాలెపుఁ దోఁటకుఁ బోయి కోడెగు
జ్జుముడిగి కొమ్మవుట్టిన జెటంగునఁ బొఁకజిత్ప్రయుక్త శూ
లమును సురాడయుంపఁ బదలంక్రిశిఁగాఁ గొనియాడి మెచ్చుచున్. 59

గీ. కొంతసేపు చూచియంతఁ దదుత్పాట, నంబుఁ బిదపవాహనంబుఁ దడవి
దిగధివరులుఁదాను దగు నెపగురు నార, దులు జయంబువొగడఁ బొలిచెనతఁడు. 60

ఉ. అక్కజఁ బోరువిన్న యొడయం డరదేటిన తల్లిఁదండ్రితో
నక్కట నేఁడు కల్యకతినాదులలోపల నొక్కఁడేనియుం
ద్రిక్కకపోయెనే యనుక దేజెనె తావకశౌర్యవార్ధి యం
దుక్కివులైరె వేల్పు లొకఁ డూఱటగా నిఁక నేమి చెప్పుదున్. 61

చ. అనిపలుకంగ నంత నసురాధిపుతాతయు లెస్సదేటి యె
త్తిన వలచేతి హేతిఁ దనుదెచ్చిన సూతుని వ్రేయఁబోవఁగా
మనుమఁడునట్టి నీభుజము మాకొకకోటగ నమ్మియుండఁగాఁ
గనుఁగొనుమయ్య నిన్నసదుగా ననలేవని యానమిల్లిన్. 62

చ. నిలువ కతండు మూర్ఛవఁగి నేఁడ కలన్మగియించి వచ్చెద
న్నిలువు మనంగ నీపరము నిక్కవమయ్యెడు మెల్లి నేఁటికిం
దెలఁచెద నిల్పుమం చతని దెచ్చి రణశ్రమ మాపుచుండఁగా
నలుగులఁ బాఱెఁబో గిరిరథాదుల శాద్రరసంబు కొల్వులోన్. 63

క. ఆరేయి నృత్తగీతవి, హారంబుల వేలుపులకు ననుభూత తిర
స్కారజ ఖేదక్రోధవి, కారంబుల రక్కసులకుఁ గడచె నృపాలా. 64

క. పొడఁగాన మంగజాలుల, నడియాలపుఁబసిఁడిబద్ద లవితూర్పునా
వెడలియిరువాగు ననికే, ర్పడఁదోఁచెం దరుణతరణిభానుశలాకల్. 65

క. క్రందుటని చూచుటకుఁబో, లెందొలిమల యెక్కె నినుఁడు లేఁదామరపూ
విందుపొడు పిందుపొదుపై, చిందులుద్రొక్కించె నుభయసేనాంబుధులన్. 66

క. అంతకు మును మేల్కని యా, సంతమసారాతివంశజలజచ్ఛాయా
కాంతుఁడు కాలోచితకృ, త్యాంతరములు చలిపి సన్నహనసంపదతోన్. 67

శా. శ్రీమజ్జన్యకుతూహలంబు ముఖరాజీవంబు సూర్యోదయ
క్షేమావాప్తికిఁ దోడుసూపి యలరం జేయంగఁ బూజించి పౌ
లోమీవల్లభ మైనవాహనము నాలోనెక్కె నుగ్రాది ది
గ్గ్రామస్వాములు సూకి రుక్షరథరక్షన్సేన కుక్ష్యాదులన్. 68

క. దానవుఁ డతఁడప్పుడు తన, సేనకుఁదలమిగిలి నిజవిజిత్వర చాప
జ్యానాద సింహనాదము, లేనాదముఁ బేదనావ మేసం జేయన్. 69

స్రగ్ధర— జగదాశాప్రోషవీచీ సఖముఖరమహోక్షుంబులం బొల్చి వెంటం

జడివాఁగం దేరరాఁగా బసువని నొకనిం బ్రేలాడించుకొంచు
స్నానగొండం గొండకాత్రై ననట గలుపుచు న్వచ్చెనో నాలుకొక్క
జడివానం జిచ్చువానం జదువుచుఁ బాదివె న్సర్వదిగ్విజరాజిన్. 70

వ. అప్పుడు గురుండు కకుత్స్థునవు నుత్తరథుం జూపి. 71

చ. అజునివరంబుకల్మి నిటలాక్షుమహోక్షముఁ దాఁకి గెల్చి ది
గ్గజములమోపు మూఁపురముగాఁ గొనమోపు సురాసురాస్త్రము
ల్గజిబిజిఁ బిప్పిగా నమలుగిత్త దతీయము తాద్భుశంపుట
క్కజములతేరి గిబ్బప్రకారము లాతఁ డజేయుఁ డెమ్మెయిన్. 72

గీ. ఈ...ద...యు నీశుఁడేమాను వానిచే, ననఁగ నీహారాస్త్రమందె నములు
చిట్టగిబ్బతోడఁ దేరితోరిపుఁ గూల్చె, రౌద్రబాణమునఁ బురంజయుండు. 73

చ. అనువదురాపుఁ డుత్తరథుఁ డట్లయినప్పుడ యుబ్బఁ గ్రోధముం
దముఁ బురికొల్ప నొండొరులఁ దార్కొని పేర్కొని వహ్నివహ్నిజ
ద్వయమయుజి జ్జలాధిప జలాదిపజిన్మఖు లాత్మనైరబం
ధములఁ జెనంగుచుండ ననిఁదాఁకె మహారథుఁ డప్పురంజయున్. 74

చ. అపుడు పురంజయుండును మహారథఘోరధనుర్భవాశుగ
ప్రసతవ బాధక ప్రవర పంజరుఁడై కెలనం గృతాంతుఁపై
నుపహాతిహేతుభూత శరమొక్కటి పూనఁగ దానితోన త
ద్రిపు నటఁ గూల్చె నజ్జముఁడు దేవరగాఁగల వేఁడితూపునన్. 75

క. వెండియు భీషణశరమున, చండించి రథంబు గరిమఁ దాద్భుశమహిమో
ద్దండత మండు మహారథు, కండలు తనవింటనేకి కాకులకిచ్చెన్. 76

వ. అప్పుడు. 77

గీ. ఒక్కజిహ్వాను పురకోటి యొత్తిగిలఁగ, నెల్లన్పు లొండురసనపు డోల్లిపడఁగఁ
జెలుపలోకనాలుకకుఁ బెల్లగిలిచనంగ, నింద్రజిహ్వనిజిహ్వత్రయంబు తోఁచె. 78

ఉత్సాహ- వాక్కు నడఁక నపుడు గురుఁడు వానివేగఁ దునుమవే
యొకకుత్స్థ యొకకుత్స్థ యుత్తరాజ మైనయా
పాకరిపుఁడు నతని జిహ్వఁ బడన కడఁగఁ దత్క్షణ
నీకుఁ బిపఁ దెలియు నవిన నిగిడిపడుచు నాతఁడున్. 79

సీ. తనమహోక్ష మపరితన యుప్పొపుముశీలు, నాలుకపును పనవు నాలుగడుగు
లంగరమున నుఖంపనంతలాపలదాయ, దగ్గఁజేసి జలపుప్షుఁ డితని. 80

బాతరువాత మేమెఱిఁగి యవ్విధిపాలికిఁ బోయి పొక్కుచు
న్మాతెఱఁగేమి చేసితివనా వరమిచ్చినతండ్రి యన్న నాఁ
డాతఁడు మీకు దిక్కుగల యాజిన చాచు నతండు నాలుకల్. 89

క. ఆగడియ యెచ్చరికతో, వేగించిన నిలుతురనియె విని యెచ్చరిక
ల్లాగునొకో యని యుంటిమి, సాగనకా యేను నీదు సన్నిధి నుంటన్. 90

వ. అని పలుకు నవసరంబున. 91

ఉ. ఏప్పను గ్రోధముం బెరయ నెక్కు త్రిశూలుఁడు రుద్రసంఘముం
గీడ్పడఁ గొట్టి బాణములు కేలనొకండును గ్రోల రెండునై
తోడ్పడిరా రథంబుడిగి తూఱఁదదీయ మనఃప్రసారము
ల్చేడ్పడఁ జేసెఁ దామసశిలీముఖ మయ్యిన వంశవీరుఁడున్. 92

శా. దానక్రేణికిరాకతండు కెలనం దత్త్రాప్యగీశత్రికీ
లానేకాశుగ భుక్కుచాకచి సముద్యత్స్ఫాలకల్యామణి
శ్రీనేతోరణమొప్పఁదూఱి విజయశ్రీఁ బెండ్లియైవత్తుఁగా
కేనంచుం జొరఁగాహరుం డెఱిఁగిపోయెం బోయినం గ్రక్కునన్. 93

క. మొననున్నదొరత్రికీలుం, దనయన్ననవైరివధ్యుఁ దమ్ముఁడు శూలం
బునఁ గూల్చికూలె గ్రోల, న్వినువీథిందోఁచునడుచు విధికూలములున్. 94

— అక్కలివడిసీసము —

వినువీథివిచిత్రమీ వేధోవరాగమం బనఘుయప్రతిహతంబగులలాట
కీలత్రయమునఁ ద్రికీలుండు నరుల కవధ్యుండుఁగాఁ బెద్దవానిఁ జేసె
నవిరోధిఁగడపఁ గీడని విన్నశూలత్రయంబు కల్మిఁ ద్రిశూలుఁడైయనన్య
వధ్యుఁడై తరువాతివాఁ డొప్పఁజేసెఁ దత్కథవిన్న నృపసూతిత్రికీలు
వలనిప్రోవఁ ద్రిశూలుండు వచ్చునపుడు, గాలిసెఁదామస మీశానగురుఁడుద్రిప్పి
యన్నఁగరశూలమునఁగూల్చె ననుజుఁడతఁడు, నడఁగఁదనశూలములనబాగయ్యెబనులు.

క. రక్షోబల మప్పు డపా, రక్షోభము త్రిప్పనిబ్బరంబునఁ బ్రతిపీ
రక్షోదక్షుమతకు సమ, రక్షోణికిఁ బాసి భయభరంబునఁ బఱచెన్. 96

చ. ఇరువురు చిక్కురాజికథ కెల్లరుఁబో శిఖిజిత్త్రికర్ణుల
య్యిరువుర నప్పగించి చనియె న్మొన యన్నటు లుండ దయ్యెరెం
డెరగలిమంట లంట విడి యేగినచందము దోఁచె మండివా
రరిబలకాననంబునకు నస్త్రశిఖిల్లిగుడ న్వెలుంగఁగన్. 97

క. ఎంపఱు గంధర్వులు వడి, రెంపఱు గుహ్యకులు మడిసి రెంపఱు నృపసం
క్రందను లీల్గిరి యప్పుడా, దొందడి మితిమీఱి వారితూపులు దొరఁగన్. 98

వ. నృపాలా యేమి చెప్పుదు నాకర్ణింపుము. 99

గీ. దెసలు మునిఁగెమునిఁగెఁ దేలెఁదేలెఁ గపుల్ష్టుఁ, గ్రాఁచెఁ గ్రాఁచెఁగల్లకల్లయనఁగఁ
గతలు పుట్టినట్టి వెతలనజాండంపుఁ, గడవఁబెట్టకతఁడు గడవఁబెట్టి 100

చ. అడుగవుగా త్రికర్ణుని గుణావళి వానితపంబు వెన్నునిం
బడసెఁ బ్రసన్నుఁగా హరికృపం గృపగల్గి జగద్రహస్యము
ల్వెడతలనున్నకర్ణుననఁ బెల్లగిలన్నకలార్థవేదియై
నడిసని నాఁడతండతని సంగరకాలము మోక్షకాలమున్. 101

క. పోరులుపుట్టిన దనుజులు, తోరానతఁ డరిగి యలుక దొడరినతూకే
ఘోరాహవకాలంబని, నారాయణుఁ డానతిచ్చినాఁ డాతనికిన్. 102

ఉ. కావున మోక్షకాలమయి కర్గెఁ ద్రికర్ణుని కల్క యత్తఱిన్
భూవరవహ్నివైరిపయిఁ బోయి పురంజయుఁ డెట్టులాడుచు
న్నావల దిప్ప డీవని మరల్చె ననాదికి మానవాస్త్రర
క్షావిధి దీపకేతునిహజారము మ్రోలికివానిఁ దేరితోన్. 103

ప్రహరణకలిక—అరదముడిగి యందతఁడును గనుఁ
దరలఁగఁ గోలువై యొనరదనుజకే
సరిఁగని వినవే జయహలహలికా
పరభట భయదప్రహరణకలికా. 104

ఉ. తూలెఁగదయ్య నీప్రెగడవోయి కృతాంతునిఁ గొంప నేరుపు
ల్చాలఁబోఁ ద్రికీలుఁడుఁ ద్రిశూలుఁడు హానినుఁ బాసిరంచు వి
ల్లాడఁగవైచి పడ్డ ననలధ్వజమేరువు ద్రెళ్ళెఁ జంపుసాం
పాటిపివో హజారపుటజాండమునం బవివోని మూర్ఛిలెన్. 105

క. డిల్లంబులైన మేనుల, నుల్లంబులఁ దేల్చికొనిరణోత్సవరతి రా
గిల్లిరి తన్మూర్ఛయుఁబో, గిల్లిరి యుపచారవిధుల గిరిరథవిరథుల్. 106

గీ. మగుడ దీపకేతుఁ దిగిచి యయ్యెరువుకు, నున్నతాసనమున నునిచిరపుడు
నడుమ విఱిగిపడిన నగరాజుఁ గమ్మలు, నడికినిలిపినట్లు యవనినాథ. 107

వ. అప్పు డద్వీపధ్వజుండు. 108

గీ. అన్నిచిక్కులవరముల య్యాసురులాంవ, నుడియఁ డెఱ్ఱఁగునె గీష్పతి నుడువకున్న

సమరవిద్యాధురంధుల యాంధ్రవిడిచి, వానిఁ జెఱసాలఁబడవేయఁ గాననైతి. 109

క. అని యొల్లఁబోవఁదాసము, కనుకని పోఁదేర్చి పాపకర్మపుటోడయా
ననుబంచిన మనకించిన, పనిముంచరె యంచు నతనిబలుకుఁ బ్రతాపిన్. 110

చ. గిరిరథుఁ జూచి నీతిపరికించి త్రికర్ణుఁడు నీవుముట్టి య
ప్పురుసున నగ్నిజిత్తునకు బాసట గంవరిసైన్యవార్ధికిం
గరయుఁ గకుత్ స్థుతాఁకునను గట్టునసై యొకఁడున్నయాంతకుం
బురమన కొప్పుకిప్పటికిఁ బొంగకుమ్రింగడు వేల్పుమూఁకలన్. 111

క. ఇదివినుమా మొనదొరలిన, వదలక యేనొకఁడఁ దారవైపున మొదలం
దవధీనమానవశిత, ప్రవరము నాయెత్తిచన్నరథముం దెచ్చెన్. 112

చ. తుదినిటు రాజుతోఁ బొమతుఁ దోలుదు గుంపులనంచుఁ దాతయొం
టిఁ దొవరినాఁడు కావున వడిం జనపుండిన నీతిగా దనం
గవలెఁ గృశానుకేతనుమొగంబునఁ దానొకమ్రొక్కువైచి పో
పొదమని తిమ్ముబున్నడుఁడు బోరికి నద్రిరథుండువగ్రతన్. 113

చ. గిరిరథమెక్కి తమ్ము లిరుఁగ్రేవ గిరిద్వయ మట్లు దవ్వులం
దురమునఁ దేసులై యొవవఁ దోఁబడి వాగులవచ్చు లీలరాఁ
గురియఁగఁ దేరిమీఁది పురికోటల కేతనదండకోటులన్
జిరిగిన నింగిమేన వడిసెం బయిపైవనరక్తపూరమున్ 114

వ. చేరం జనునప్పుడు. 115

క. లావలికించిన మొదలివ, లావలికించిన తెఱంగు లవలవలైకా
లావలికి నిడిన దనుజబ, లావలికిఁ గకుత్ స్థుఁ బొదువ నల నపు డోదవెన్. 116

గీ. బలపయోరాశితోఁ కలపట్టు మునుగఁ, నిలిచి యీఁదు తిమింగిల గిలగిలములొ
యింద్రుఁ డొద్దైనమరలు మహీధరములొ, వెపలు నడదీవులో యనవిరథరథులు. 117

క. దానవసైన్యము వెలువడి, మానవలోకేశగణ మమర్త్యగణము నీ
కౌనాకానని మారొ్క్కన, రానపుడొదిరించి రచలరథునలాదుల్. 118

వ. ఆయోద్ధ్వరయందును దలకడచి దహన దంష్ట్రధర దర్పక ద్విషులు తమవాహనంబు
లం దతిమి యయ్యవసరంబున. 119

క. మనిపట్టు మనియె మస్తక, మనినట్లనినారు ద్రష్టలయినట్లయ్యెన్
బనిదాఁకెఁ దగఱు గిరి న, య్యెమబోతును నెద్దుఁ జావలే కొండాడన్. 120

ఉ. అమ్మొయిఁ నద్రథాచలము నంటెశఁ గొమ్ముల మస్తకంబు పే

